3

# నూతన
# కేరళ రాష్ట్ర సమస్యలు

రచన:

ఇ. ఎమ్. ఎస్. నంబూద్రిపాద్

అనువాదం:

మహీధర రామమోహన్‌రావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవా

2677

జగమంతా ఎటు చూచినా
ఆనందం - ఆహ్లాదం
మనిషి బ్రతుకు ఒకచే దు
ర్గంధం, హేయం, ఖేదం।

1933 లో మహాత్మాగాంధీ హరిజన సమస్యపై కేరళకు వచ్చినప్పుడు ఒక సభలో చదివిన పద్యం ఇది. కేరళలో అస్పృశ్యులు పొందుతున్న బాధలూ, అవమానాలూ చూసి ఒక్క గాంధీమహాత్ముడేకాదు - ప్రపంచంలోని ప్రజాతంత్రవాదులంతా అదేమాట అన్నారు. వానిని చూసి స్వామి వివేకానంద కేరళ ఒక "పిచ్చాసుపత్రి" అన్నారు.

అస్పృశ్యుల అవమానాలకూ, బాధలకూ కారణం అవుతున్న సామాజిక అసమానతను చూస్తేనేకాదు, కేరళ ప్రజల ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక జీవితాలను గమనించిన వాళ్లెవరయినా అదేమాట అంటారు.

జగమంతా ఎటుచూచినా
ఆనందం - ఆహ్లాదం
మనిషి బ్రతుకు ఒకచే దు
ర్మార్గం, హేయం, ఖేదం।

# 1

# సహజసంపదలు

కాశ్మీరంలాగే కేరళం దేశంలోకల్లా అందమైన ప్రదేశాల్లో ఒకటి. దేశం ఎంత అందమైనదైనా అక్కడి ప్రజల జీవితంలో మాత్రం ఆనందం లేదు సరికదా దుఃఖభరితం కూడా. అక్కడి కుటుంబాల సగటు ఆదాయం దేశంలోకల్లా తక్కువేనేమో కూడా.

అక్కడ సహజ సంపదలు మిక్కుటం. వాని ఆధారంతో అనేక పెద్ద పరిశ్రమల్ని నిర్మించవచ్చు. ఈనాటి ప్రభుత్వం తన పరిశ్రమల విధానాన్ని వివరిస్తూ చేసిన ప్రకటనలో ఈ విషయం వివరించబడింది.

ముడిసరుకులు : భారతదేశంలో తయారయ్యే రబ్బరులో నూరింట 93 వంతులు కేరళలో తయారవుతూంది. ఇక్కడ జమ్ము, వెదురు, మెత్తని కలప, గట్టి కలప, నిమ్మనూనె, ఖనిజ ద్రవ్యాలతో నిండిన ఇసుక, కర్ర

పెండలం, సుద్దమన్ను మొదలయిన వనేకం రాష్ట్రంలో దొరుకుతాయి. పెద్ద పరిశ్రమలకీ, మధ్యరకం, చిన్న తరహా పరిశ్రమలకీ ఈ ముడిసరుకు లెంతో ఉపయోగ పడతాయి. ముడిసరుకుల్ని తయారుచేసే చిన్న పరిశ్రమలకు కావలసిన వస్తువులుకూడా దండిగా దొరుకు తాయి.

విద్యుత్తు : ఒకే స్థాయిని చవకగా రాష్ట్రం అంతటా పరిశ్రమల కోసం విద్యుత్తు లభ్యం అవుతూంది. జలవిద్యుత్కేంద్రాలనింకా కడుతున్నారు. విద్యుత్సరఫరా ఏడాది పొడుగునా ఒకే విధంగా వుంటూంది.

రహదారులు : రాష్ట్రం అంతటా మంచిరోడ్లు వల పరచినట్లున్నాయి. రాష్ట్రంలోని ఉత్తర,దక్షిణ భాగాల్ని కొచ్చిన్ రేవుతో కలుపుతూ నిర్మిస్తున్న రైలుమార్గం ఈ ఏడాది పూర్తి అవుతుంది. దేశంలోకల్లా ఉత్తమమైన వానిలో కొచ్చిన్ హార్బర్ ఒకటి. సంవత్సరంలో ఏకాలంలోనూ, ఏ సరుకునైనా ఇక్కడికి తేవచ్చును. కోస్తా ప్రాంతంలో ఉప్పుటేర్లూ, కయ్యాలూ, కాలువలూ వున్నాయి. వాని ద్వారా చవకగా, సులభంగా సరుకుల రవాణా జరుగు తుంది.

పనివాళ్లు : రాష్ట్రంలో విద్యావంతు లధికం. సాంకేతిక శిక్షణ పొందినవారూ, సాధారణ విద్యావంతులూకూడ హెచ్చుగానే వున్నారు. పని కుశలతగలవాళ్ళకీ, సాధారణ పని వాళ్ళకీ కూడ తెలివీ, కండపుష్టి, పరిస్థితులకు అలవాటు పడగల శక్తీ బాగా ఉన్నాయి,

ఇంతవరకు ఈ సహజ సంపదల్ని వృద్ధిపరిచేటందుకు ప్రయత్నాలేవీ జరగలేదు. దీనికో ఉదాహరణ చూపిస్తే అర్థం అవుతుంది. మన దేశం మొత్తంమీద ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో మొత్తం సొమ్ములో నూటికి ఎనిమిదివంతులు పరిశ్రమలకోసం ప్రత్యేకించేరు. దేశం మొత్తంమీద ప్రణాళిక మొత్తం 2069 కోట్ల రూపాయలు, పరిశ్రమలకు కేటాయించినది 170 కోట్ల రూపాయలు. కాని, తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రంలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక వ్యయం 30 కోట్ల రూపాయలయితే పరిశ్రమలకు కేటాయించినది 22 లక్షల రూపాయలు మాత్రమే. (రమారమి ½%) ఈనాటి కేరళ రాష్ట్రంలోని మలబారు ఆనాడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోవుండేది. ఆ రాష్ట్రంలో పరిశ్రమలకు కేటాయించిన 6 కోట్ల రూపాయలలో మలబారులో ఖర్చు చేసినది, ఏడువేలు మాత్రమే.

వ్యవసాయంమీద ఎక్కువగా ఖర్చు చేయడంచేత పరిశ్రమల వాటా తగ్గిందా అంటే అదీలేదు. పంజాబ్, బీహార్, బెంగాల్, ఒరిస్సా, ఆంధ్ర మొదలయిన రాష్ట్రాలలో భాక్రా నంగల్, దామోదరలోయ ప్రాజెక్టు, హీరాకుడ్, నాగార్జున సాగర్ వంటి పెద్దపెద్ద ప్రాజెక్టులు నిర్మిస్తున్నారు. ఇంకా అనేక సాగుసౌకర్యాలు కలిగిస్తున్నారు. జలవిద్యుత్కేంద్ర నిర్మాణాలు సాగించబడుతున్నాయి. కేరళలో అటువంటివేవీ లేవు. నీటి పారుదల ప్రాజెక్టులు కొద్దిగా నిర్మిస్తున్నారు. అవన్నీ కలిపినా పైన చెప్పిన ఏవక్క ప్రాజెక్టుకీ సరిపోవు. పెద్ద ప్రాజెక్టులు లేకపోతే మానె, చిన్నవైనా నిర్మించారా అంటే అదీలేదు. వ్యవసాయాన్నివృద్ధి పరచేందుకు మరో ఏర్పాట్లూ లేవు. ఫలితంగా

వ్యవసాయపద్ధతులలోనూ పెద్దమార్పు లేదు. వ్యవసాయోత్పత్తి పెచ్చులేదు.

దేశానికంతకూ ఆర్థికంగా ఎంతో వుపయోగపడుతున్న పంటలు కేరళలో పండుతున్నాయి. దేశంలో వుత్పత్తయ్యే రబ్బరు ఇంచుముంచు అంతా ఇక్కడే వుత్పత్తి అవుతూంది. రెండు లక్షల ఎకరాలలో రబ్బరు పండిస్తున్నారు. (అంటే 98 శాతం రబ్బరు తోటలు కేరళలోనే వున్నాయన్నమాట) దక్షిణ భారతంలో తయారయ్యే తేయాకులో 56 శాతం ఇక్కడ తయారవుతుంది. 75 శాతానికి మించి ఏలకి ఇక్కడ పైరవుతూంది. నల్లమిరియం ఇంచుమించు అంతా ఇక్కడినుంచే వెడుతూంది. దేశంలోని తేయాకు తోటల్లోనూ, ఇతర తోటల్లోనూ అధిక భాగం ఇక్కడున్నాయి. ఇక్కడ పైరయ్యే కొబ్బరి, దానికి సంబంధించిన ఇతర వస్తువులు, తోటల పంటలు మన దేశంనుంచి బాగా ఎగుమతి అయి విదేశీనాణేల్ని బాగా సంపాదిస్తున్నాయి. దేశానికింత సహాయపడుతున్నా కేరళ రైతులకీ వ్యవసాయకూలీలకూ లభిస్తున్న దేమీలేదు. పైపెచ్చు ఈతోటల మూలంగా ఆహారపుపంటలు వెనకబడి వారు అష్టకష్టాలూ పడుతున్నారు. తోటల పంటలవలన వచ్చే లాభాలన్నీ కొద్ది మంది విదేశీ, దేశీ వ్యాపారులకూ, పరిశ్రమయజమానులకూ, కొద్దిమంది భూస్వాములకూ దక్కుతూంటే, ఆహారధాన్యాల కొరతవలన ఏర్పడుతున్న ఆర్థిక ఇబ్బందులన్నీ సాధారణ ప్రజానీకంమీద పడుతున్నాయి.

మనదేశం నేడు గొప్ప ఆర్థిక ఇబ్బందిలోవుంది. అది కేరళ విషయంలో మరీ స్పష్టంగా కనబడుతూంది. ప్రభుత్వం

కోట్లకొలది రూపాయలను అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించేటందుకై ఖర్చు చేసిందనీ, ఆ ధనం అంతా ప్రజల చేతుల్లోకి చేరిందనీ, వారు దానిని తిండికోసం, ఇతర అవసర వస్తువులకోసం వ్యయం చేస్తున్నారనీ, ప్రస్తుతపు డబ్బు చిక్కులకు మూలం అదేననీ ఆర్థికశాస్త్రవేత్తలు చెప్తున్నారు. కాని అదే మిటో కేరళలో ప్రజల ఆదాయాలు తగ్గి, బాధలు పడుతున్నట్లు కనిపిస్తూంది. వారు కొనుక్కోవలసిన వస్తువుల ధరలు పెరిగిపోతున్నాయి. వారు అమ్ముకొనవలసినవాని ధరలు అలాగే వుండిపోవడమో, పడిపోవడమో జరుగుతూంది.

కేరళలో జనాభా హెచ్చు. రాష్ట్ర వైశాల్యం 14980 చదరపు మైళ్ళు. జనాభా 136 లక్షలు. దేశంలోకల్లా జనసమ్మర్ధంగల రాష్ట్రం ఇది. భారతదేశపు వైశాల్యంలో కేరళం వైశాల్యం 1.2 శాతం. జనాభా మాత్రం 3.1 శాతం. మరొకలాగా చెప్పాలంటే భారతదేశం మొత్తంమీద చూస్తే సగటున చదరపు మైలుకి 281 మంది నివసిస్తున్నారు. కాని కేరళలో చదరపు మైలుకి 908 మంది ప్రజలు నివసిస్తున్నారు. కేరళ ప్రజలు కళా కుశలురు, వృత్తి నిపుణులున్నూ. వారి బుద్ధికుశలతను దేశం అంతా మెచ్చుకుంటారు. మేధావంతులూ, ఉద్యోగులూ చాలమంది ఇక్కడినుంచి దేశం అంతటా వ్యాపించారు. ఇంత ప్రజ్ఞవున్నా రాష్ట్ర ప్రజలలో చాలమంది నిరుద్యోగులు. చాలమంది వుద్యోగాలు వెతుక్కుంటూ దేశంలోని దూరప్రాంతాలకీ, దేశాంతరాలకీ కూడ పోవలసి వస్తూంది. ఆవిధంగా ప్రజలశక్తి యుక్తులలో అధికభాగం మన సహజ సంపదలను ఉపయోగంలో పెట్టేటందుకుగాక దేశం అంతటా కూలీల్నీ, గుమాస్తాల్నీ సరఫరా చేయడానికి పనికివస్తూంది.

ఒక్క ఆర్థిక విషయంలోనేగాక సాంఘికంగానూ, రాజకీయంగానుకూడ ఈ అసంబద్ధ స్థితే కనబడుతుంది. కేరళలో అస్పృశ్యత చాల భయంకరమైన సామాజిక పిశాచియంటూ స్వామీ వివేకానంద, మహాత్మాగాంధీకూడచెప్పారు. అందులో అబద్ధంలేదు. అస్పృశ్యత అంటే ఏదో కొన్ని వర్ణాలవారు ఉత్తములనీ కొన్ని వర్ణాలవారు అధములనీ చెప్పడమే కాదు. కొన్నివేల సంవత్సరాలు మన సమాజాన్ని పీడిస్తున్న ఒక దీర్ఘవ్యాధి కది చిహ్నం మాత్రమే. వర్ణాలుగా సమాజం విభజింపబడడం అనేదే ఈ దీర్ఘవ్యాధి. వర్ణాలున్నంతవరకూ వానిమధ్య నున్న హెచ్చు తక్కువ తేడాల్ని రద్దుపరచినా ప్రయోజనం లేదు. ఈ విభజనే నేడు రాజకీయాలలోకి ప్రవేశించి ఒక పెద్ద భయానక రోగంగా పరిణమించింది. వర్ణాల హెచ్చు తగ్గులు, అస్పృశ్యత మాదిరి గనే ఈ విభజనకూడా చాల ప్రమాదకరంగా తయారయింది.

మనం నేడు పార్లమెంటరీ ప్రజాతంత్ర వ్యవస్థలో జీవిస్తున్నాం. ఈ వ్యవస్థలో పార్టీల నిర్మాణం ఒక ప్రధాన భాగం. ఈ పార్టీలను, పార్లమెంటరీ ప్రజాతంత్ర వ్యవస్థను పక్కకునెట్టి మన రాజకీయాలు ఈనాడు చాలవరకు వర్ణాలు, మతాలు, కులాలమీద ఆధారపడి నడుస్తున్నాయి. ఆర్థిక, రాజకీయ విధానాలకు సంబంధించిన సమస్యలమీదగాక, వర్ణాల, కులాల స్వార్థ సంకుచిత ప్రయోజనాల సమస్యలపై మనదేశంలో ఆర్థిక, రాజకీయ కుట్రలు సాగుతున్నాయి. కల్లోలాలు ఏర్పడుతున్నాయి. మతాభిమానాల్ని, వర్ణాభిమానాల్ని ఖండించి తూర్పారబడుతున్నవారంతా ప్రజాతంత్ర దృక్పథంతోనూ జాతీయైక్యతా దృక్పథంతోనూ వ్యవహరిస్తున్నారని భ్రమపడ

కూడదు. వర్ణాభిమానం లేనట్లు నటి స్తే, వారి స్వకులప్రయో జనాలేవో సానుకూలపడే అవకాశం వుండివుంటుంది. ఈ వర్ణ భేదం ప్రజల వొంట్లో ఎంత ఎల్లా జీర్ణించిపోయిందంటే "ఒకే జాతి, ఒకే మతం, ఒకే నీతి" అను సూత్రాన్ని బోధించిన శ్రీ నారాయణ గురును నూతన కేరళకు నాయకుడని చెప్పక, ఆయన పుట్టిన జాతికి మాత్రమే నాయకుడని చెప్పడం జరుగుతూంది. [మధ్యయుగాల నిరంకుశ విధానాలకు వ్యతిరేకంగా సంఘ సంస్కరణలకోసం శ్రీ నారాయణ గురు అచంచలంగా పోరాడిన యోగి]

కేరళలోని ప్రజాతంత్రోద్యమాన్ని ఎదుర్కొంటున్న సమస్యలు కొన్నింటిని పైన చెప్పేను. ఈ సమస్యల పరిష్కారానికై సాగిన పోరాటాలలోనే ప్రజా వుద్యమం అనేక రూపాలు ధరించింది. కేరళ సంస్కృతిని పునరుద్ధరించడానికీ, సంస్కరించడానికీ పెద్ద ప్రయత్నాలు జరిగాయి. వివిధ జాతుల, కులాల ఆచార వ్యవహారాలలో మార్పులు జరగాలని ఉద్యమాలు తల ఎత్తేయి: అసలువర్ణవ్యవస్తే రద్దు కావాలన్న ఉద్యమం వచ్చింది. అందరికీ చట్టరీత్యా సమానాధికారాలుండాలని పౌర, ప్రజాతంత్ర హక్కులకై వుద్యమం బయలుదేరింది సంస్థానాలలో ప్రజా ప్రభుత్వాలు ఏర్పడాలనీ, బ్రిటిష్‌పాలన అంతరించాలనీ ఉద్యమాలు సాగేయి. కష్టజీవుల ఆర్థికస్థితిని బాగుపరచాలని వుద్యమం పుట్టింది. ఇల్లాగే అనేక రూపాలు తలఎత్తేయి.

ఈ వుద్యమాలు అభివృద్ధి పొందిన ఫలితంగానే 1936లో కేరళలో కమ్యూనిస్టుపార్టీ పుట్టి, క్రమంగా బలపడింది. కేరళలో సాగిన ప్రజాతంత్రోద్యమ రూపాలన్నింటా పాల్గొన్న యోధులే కమ్యూనిస్టుపార్టీ నిర్మాతలలో కనబడతారు. చిన్నచిన్న సాం

ఘిక సంస్కరణలకోసం పోరాడినవారు అసలు సాంఘిక వ్యవస్థ స్వరూపం మారనిదే ప్రయోజనం లేదని గ్రహించేరు. రాజకీయంగా స్వాతంత్ర్యంకోసమూ ప్రజాతంత్రం కోసమూ పోరాడినవారు ప్రజానీకంయొక్క పరిస్థితులను చక్కబరిచేటందుకై తమ పోరాటాలు ఉపయోగిస్తే తప్ప వాటి వలన లాభం లేదని గ్రహించేరు. సాంఘిక వ్యవస్థలో ప్రధానమైన మార్పువస్తే తప్ప సాహిత్యమూ, సంస్కృతీ అభివృద్ధి పొందవని ఆ రంగాలలో పేరు ప్రఖ్యాతు లార్జించిన వారు గ్రహించేరు. వీరే మొదట కమ్యూనిస్టు పార్టీని నిర్మించేరు. ఇల్లాంటివారే కమ్యూనిస్టుపార్టీని బలపరిచేరు.

సుసంపన్నమైన నూతన ఐక్య ప్రజాతంత్రయుత కేరళాన్ని నిర్మించడంకొరకే కమ్యూనిస్టుపార్టీ ప్రప్రథమంనుంచీ ప్రయత్నించిందంటే ఆశ్చర్యంలేదు. ఐక్య కేరళకై ఉద్యమించిన కమ్యూనిస్టుపార్టీ ప్రాచీన కేరళకు సంబంధించిన ఒక జానపదగాథను, నిత్యమూ దృష్టిపథంలో వుంచుకొంటూంది. కేరళ మహాబలిరాజ్యమని ప్రసిద్ధి. ఆ రాజ్యంలో ప్రజలమధ్య హెచ్చుతగ్గులు లేవనీ, అందరికీ ఏది కావలసినా సమృద్ధిగా లభించేదనీ ఒకపాట వుంది. ఇప్పటికీ కేరళ ప్రజ ఆ దినాలను మరిచిపోలేదు. 'ఓనమ్' పండుగ (ఉగాది) నాడు మహాబలి పాలించిన నాటి సమానత్వాన్నీ, సమృద్ధినీ యథాశక్తిగా ప్రతి కుటుంబమూ అమలు జరపటానికి ప్రయత్నిస్తూంటుంది. ఈ జానపద గాథలోని సాంఘికాచారాన్ని కేంద్రంగా చేసుకొని కమ్యూనిస్టుపార్టీ ఈనాటి జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల కనుగుణమైన పద్ధతిలో మహాబలికాలంనాటి పరిస్థితులను

సృష్టించుకొందామని నినాదం ఇచ్చింది. అంటే సంపన్నమయిన, నూతనైక్య ప్రజాతంత్ర కేరళను నిర్మించాలంటూ కమ్యూనిస్టు పార్టీ యిచ్చిన నినాదం మహాబలి కథలో చెప్పిన సమానత్వం, సమృద్ధీ, ప్రజాతంత్రమూ నెలకొనాలనే కేరళ ప్రజల జాతీయ వాంఛకు ప్రతిబింబం. ఆ జాతీయ వాంఛకు కమ్యూనిస్టుపార్టీ తన నినాదంలో ఆధునిక, శాస్త్రీయ నిర్వచనాన్నిచ్చింది.

నవకేరళ నిర్మాణంకోసం సాగిస్తున్న పోరాటంలో కమ్యూనిస్టుపార్టీ ఎన్నో చిక్కుల నెదుర్కోవలసి వచ్చింది. పార్టీ వ్యతిరేకులు దానిని "మాస్కో ప్రతినిధి" అని నిందించేరు. నవకేరళకోసం నడుపుతున్న వుద్యమాన్ని విదేశీయుల ప్రోత్సాహంతో సాగిస్తున్నదేనని నిరసించేరు. కాని విదేశీయుల అండదండలు పొందుతున్నది కమ్యూనిస్టులు కాదనీ, వారి వ్యతిరేకులేననీ క్రమంగా కేరళలో అధిక సంఖ్యాకులు గ్రహించసాగేరు. కమ్యూనిస్టుపార్టీ ప్రజలముందుంచిన కార్యక్రమం కేరళ నిజపరిస్థితి కనుగుణంగా వుందని తెలుసుకొంటున్నారు. కమ్యూనిస్టులు కేరళను తమదిగా భావిస్తున్నారనీ, ఆ విధంగానే పనిచేస్తున్నారనీ గుర్తిస్తున్నారు. కేరళలోని ప్రజానీకంమధ్య నివసిస్తూ, వారి ఆశలకూ, ఆశయాలకూ రూపం ఇస్తూ వారికోసం దినదినం ఎన్నో కష్టాలుపడుతూ, త్యాగాలుచేస్తున్న కమ్యూనిస్టుపార్టీమీద ఎన్ని అభాండాలు వేసినా, ఎన్ని అబద్ధాలు ఆడినా వారితో కలిసి జీవిస్తూ పని చేస్తున్న ప్రజలు నమ్మరు.

అందుచేతనే 1942లో కమ్యూనిస్టులు దేశానికి ద్రోహం చేసేరంటూ తెగనాడుతూ దుమారంలేపినా 1946 ఎన్నికలలో

కమ్యూనిస్టు అభ్యర్థులకు 25 శాతం వోట్లుపడ్డాయి. 1952 జనరల్ ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ కేరళలో ప్రధానపక్షంగా విజయం పొందిందంటే ఇదే కారణం. మొన్నటి ఎన్నికలలో పార్టీ ప్రభుత్వాధికారంలోకి వచ్చిందన్నా ఇదే కారణం.

ఈవేళ సహజంగానే కొన్ని ప్రశ్నలు వస్తాయి: సంపన్నమైన నూతన, ఐక్య ప్రజాతంత్ర కేరళను నిర్మించడానికై కమ్యూనిస్టుపార్టీ ఏం చేయదలచింది? పార్టీ ఏర్పరచిన ప్రభుత్వం పార్టీ 20 ఏళ్ళనుంచి ప్రజల ముందుంచుతున్న కార్యక్రమంలోని వివిధాంశాలను ఏవిధంగా అమలు జరపబోతూంది? ఇంతవరకు తీసుకొన్న చర్యలేమిటి? వచ్చే రెండు మాసాలలో చేయదలచినదేమిటి?

ఈ ప్రశ్నలకు ఈ కరపత్రంలో సమాధానం ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

# 2

# ప్రణాళిక అంతిమ లక్ష్యాలూ, తక్షణ కర్తవ్యాలూ

కేరళ కేమిటి, దేశం మొత్తానికేమిటి - ఉన్న పాదార్థిక సమృద్ధినీ, జన సమృద్ధినీ సక్రమంగా వుపయోగించుకోవడం ఎలాగనేదే నేటి సమస్య అని పైన చెప్పిన దానినిపట్టి గ్రహించవచ్చును. దేశంలోని సహజసంపద నంతనూ బాగా వుపయోగపడేటట్టు చేయడం ఎల్లాగ ? ప్రకృతి సంపదలకూ, మానవ సమృద్ధికీ పొత్తుకుదిర్చి రెంటినీ బాగా వృద్ధి పరచే దెట్లాగ - అనేదే మనముందున్న సమస్య.

ప్రణాళికా సంఘం రెండో పంచవర్ష ప్రణాళికను తయారుచేసినప్పుడు దేశం మొత్తంమీద స్థూలంగా అనుసరించ వలసిన విధానాలను చూపించింది. దేశంలోని పారిశ్రామిక, వ్యవసాయిక సంపదలను త్వరగా అభివృద్ధిపరచడం ఎల్లాగ ? ఈ రెండురంగాల మధ్యనూ, భారీ-తేలిక పరిశ్రమల మధ్యనూ, ఆహారపంటలూ వ్యాపారపంటల మధ్యనూ అభివృద్ధిని సమన్వయ పూర్వకంగా సాధించడం ఎల్లాగ? అనే విషయాల్ని ప్రణాళికా

సంఘం తాను ఆలోచించింది. ఆలోచించవలసిందని ప్రజల ముందు పెట్టింది. ప్రణాళిక అంతిమ లక్ష్యాలకూ తక్షణ కర్తవ్యాలకూ మధ్యనుండే అంతరాన్ని చూపించింది. అవి రెండూ ఒకదానికొకటి సరిపడేలా చూడాలని చెప్పింది. మళ్ళీ తక్షణ కర్తవ్యాలను నాటి నిర్దేశించినప్పుడు పంచవర్ష ప్రణాళి కల అవసరాన్ని చెప్తూనే, వాటి పరిమితులలో ఏ యేటా ఏమేమి చేయాలో స్కీములను తయారుచేసింది.

ఈ మాదిరి ఆలోచనాపద్ధతి కమ్యూనిస్టుపార్టీకి, మా ప్రభుత్వానికీ కూడా పూర్తిగా ఇష్టమే. మనకిప్పుడున్న అవ కాశాలను సరిగ్గా అంచనాకట్టి తక్షణ కర్తవ్యాలను నిర్ణ యించుకోవాలి. వానికి మన అంతిమ ఆదర్శాలతోనూ దీర్ఘ కాలగమ్యాలతోనూ పొత్తు కుదర్చాలి. అప్పుడే మన ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిపరచడంలో మనకున్న సహజసంపదలనూ, ప్రజాసమృద్ధినీ సరిగ్గా వినియోగపరచుకోగలుగుతాం. మన పరిశ్రమలూ, వ్యవసాయమూ, ఇతర ఆర్థిక వ్యవహారాలూ అప్పుడు బాగా ముందుకు సాగగలుగుతాయి. సహజసంపదల నుపయోగించుకోవడంలో జరుగుతున్న అవకతవకలు సరి అవు తాయి. రెండో పంచవర్ష ప్రణాళికలో నిర్దేశించినది క్రింద ప్రధాన గమ్యాలుకూడా మాకు చాలవరకు అంగీకారమే.

"(ఎ) దేశంలో జీవనస్థాయిని తగినంతగా పెంచేటందుకు వీలుగా జాతీయాదాయాన్ని బాగా పెంచాలి;

(బి) కీలక పరిశ్రమలనూ, భారీపరిశ్రమలనూ అభివృద్ధి చేయ డానికి ప్రాముఖ్యతనిస్తూ త్వరగా దేశంలో పరిశ్రమల్ని ఎక్కువ చేయాలి;

(సి) ఉద్యోగావకాశాలను బాగా ఎక్కువచేయాలి;

(డి) ఆదాయాలలోనూ, సంపదలలోనూ వున్న అసమానతను తొలగించాలి. ఆర్థిక బలాన్ని సమంగా పంచేటందుకు ప్రయత్నాలు క్రమంగా జరగాలి.

"ఈ ఆశయాలన్నీ పరస్పరాధీనాలు. ఉత్పత్తీ, పెట్టుబడులూ బాగా పెరుగుతేనేగాని జాతీయాదాయం పెరుగదు. జీవన స్థాయిలో పెరుగుదల వుండదు. ఉత్పత్తీ, పెట్టుబడులూ బాగా పెరగాలంటే ఆర్థిక సాంఘిక నిధులను సమకూర్చుకోవాలి. ఖనిజాలు దొరకేచోట్లను పరిశోధించాలి. వాటిని తవ్వి తీయాలి. ఉక్కు పరిశ్రమ మొదలయిన కీలక పరిశ్రమలను పెంపొందించాలి. అది చాలా ముఖ్యం. ఇవన్నీ ఒకేమారు జరగాలంటే మనకున్న మనుష్య బలగాన్నీ, సహజ సంపదల్నీ బాగా వుపయోగించుకోవాలి. ప్రజాసమృద్ధి బాగావున్న దేశంలో ఉద్యోగావకాశాలను బాగా విస్తరింపచేయడం అత్యావసరం. ఇంతేకాదు. ఈ అభివృద్ధి క్రమమూ, విధానమూ మన సాంఘికావసరాలనూ విలువలనూ ప్రతిబింబిస్తూండాలి. అభివృద్ధి వచ్చినకొద్దీ ఆర్థిక, సాంఘిక అసమానతలు తగ్గిపోవాలి. ఈ తగ్గుదలను ప్రజాతంత్ర పద్ధతులలో, ఆదేక్రమంలో సాధించాలి. ఆర్థిక గమ్యాలనూ సాంఘిక గమ్యాలనూ వేరు చెయ్యరాదు. మన ఆశయాలూ, కార్యవిధానాలూ పరస్పరంగా సాగాలి. ప్రణాళిక ప్రజల కోరికలను తీర్చ

డానికి పూనుకొన్నప్పుడే ఏ ప్రజాతంత్ర సమాజమయినా తన శక్తినంతనూ వినియోగించి పనిచేయగల్గుతుంది."

కాని, ప్రణాళికా సంఘం సూచనల దృష్ట్యా, కేరళ రెండోపంచవర్ష ప్రణాళికను తయారుచేసిన పద్ధతి మాకు నచ్చ లేదు. ప్రణాళికాసంఘం రూపొందించిన కేరళ ప్రణాళికలో రెండు ముఖ్యలోపాలున్నాయి. మొదటిది: యీ రాష్ట్రానికి వారు కేటాయించిన మొత్తం ఏ మూలకీ చాలదు. దేశం మొత్తానికి కేటాయించిన సొమ్ముతో పోల్చిచూసినా, రాష్ట్రా వసరాలను పట్టిచూసినా అదెంతమాత్రం చాలదు. రెండోది: రాష్ట్రంలోనే వివిధ రంగాలకు కేటాయించిన పద్ధతికూడా సరిగ్గాలేదు. రాష్ట్రంలో ఏ రంగం అభివృద్ధి పొందవలసిందో. అసలు పరిస్థితులేమిటో ఆలోచించి చేసినట్లులేదు, పాక్షికంగా వుంది.

రెండో పంచవర్ష ప్రణాళికలో వున్న ఈ రెండు లోపా లనూ వివరించేముందు ఒక్కటి చెప్పాలనుకుంటున్నా, మిగిలిన దేశం ఏమయిపోయినా సరే కేరళ బాగుపడితేచాలనే ధోరణిలో నేను మాట్లాడడంలేదు. ఏ రాష్ట్రమూ, ఏ ప్రభుత్వమూకూడ ఆ విధంగా రాష్ట్రావసరాలను దేశావసరాలకు పోటీ పెట్టరా దనే మా అభిప్రాయం. దేశం అంతా అభివృద్ధి చెందితే తప్ప ఏ రాష్ట్రమూ తగినంతగా వృద్ధిపొందలేదని కొంచెం ఆలోచన వున్న ఏ భారతీయ దేశభక్తుడైనా ఒప్పుకొంటాడు. కొందరు ఇతరులు భారతదేశంతో సంబంధాలు లేకుండా కేరళం స్వతం త్రంగా ఐక్యం కావాలని అంటున్నారు. మా కమ్యూనిస్టుల అభిప్రాయం వేరు. నూతన ఐక్యకేరళం ప్రజాతంత్రయుత

నవభారతంలో భాగంగా తన పాత్రను నిర్వహించాలనేదే మా కోరిక. అందుచేతనే కేరళకు ఏదో ప్రత్యేకంగా కావాలని మేము కోరడంలేదు. మిగిలిన దేశాన్ని నష్టపరచి కేరళను వృద్ధి పరచాలనేది మా కోరిక కాదు.

కాని, దేశాభివృద్ధిలో యీ రాష్ట్రానికి న్యాయంగా రావలసిన వాటాను ఇవ్వడానికి నిరాకరిస్తున్నారు.

ఉదాహరణకు మొదటి పంచవర్ష ప్రణాళికను తీసుకొందాం. ఈ ప్రణాళికలో దేశం మొత్తంమీద 2 వేల కోట్ల రూపాయలకు పైగా ఖర్చుచేసేరు. దానిని జనాభా నిష్పత్తి మీద పంచుతే తిరువాన్కూరు, కొచ్చిన్ రాష్ట్రానికి 55 కోట్ల రూపాయలు రావాలి. కాని దానికి మొట్టమొదట కేటాయించినది 27 కోట్లు మాత్రమే. తర్వాత 30 కోట్లకు పెంచేరు. అంతే.

మళ్ళీ రెండో పంచవర్ష ప్రణాళికలోకూడ ఇదే తేడా కనిపిస్తుంది. ఈ ప్రణాళికలో దేశం మొత్తానికి చేసేఖర్చు 4800 కోట్ల రూపాయలు. (అదిప్పుడు 5300 కోట్లకు పెంచేరు). ఈ మొత్తాన్ని జనాభా నిష్పత్తి ప్రకారం పంచుతే నేటి కేరళ రాష్ట్రానికి 170 కోట్ల రూపాయలు కావాలి. కాని, నిజానికి కేటాయించినది 87 కోట్ల రూపాయలే.

అంటే రెండు ప్రణాళికలలోనూ కూడ జనాభానిష్పత్తి ప్రకారం మాకు రావలసినదాంట్లో సగమే మాకిచ్చేరు.

జనాభా నిష్పత్తిని పట్టి ప్రతిరాష్ట్రానికి సమానంగా పంచాలనడం న్యాయం కాదన్నదొక్కటే దీనికి సమాధానం చెప్తున్నారు. దేశానికంతకూ అవసరమైన కొన్ని పెద్దప్రణాళిక

ఋన్నాయనీ, వాటిని రాష్ట్రాలమధ్య పంచటం సాధ్యంకాదనీ అంటున్నారు. ప్రణాళిక కోటాలను నిర్ణయించేటప్పుడు జనాభా నొక్కదానినే గణనలోకి తీసుకోకూడదన్నారు. ఈ వాదనలలో కొంచెం నిజం లేకపోలేదు. ఉన్న ధనాన్నంతనీ రాష్ట్రాలమధ్య సరిసమానంగా పంచాలని మేముకూడా చెప్పడంలేదు. ప్రతి రంగంలోనూ రాష్ట్రాలన్నింటికీ సమానమైన వాటా ఇవ్వాలనడం అర్థంలేని మాట.

కాని, ఒక్కటడుగుతా : దేశానికంతకూ ప్రధానమైన ప్రాజెక్టులలో ఒక్కటీ కేరళలో ఎందుకు నిర్మించడంలేదు ? భారీపరిశ్రమ కావాలన్నా, పెద్ద నీటిపారుదల ప్రాజెక్టు కావాలన్నా టలాయిస్తారేం ? మా రాష్ట్ర వాతావరణమూ, సహజ సంపదలూ దేశప్రాధాన్యతగల పెద్ద ప్రాజెక్టుల నిర్మాణానికీ సరిపడవా ? చవుకయైన వ్యాపారపు పంటలు పండించుకోమనీ. చవుకగా కూలికిపోయి బ్రతకమనీ, ఎంత డబ్బయినా బియ్యం పైనుంచే తెప్పించుకు తినమనీ, దొరక్కపోతే మాడిచావమనీ- నోటితో చెప్పకపోయినా క్రియలో చూపించేస్థితి ఎందుకొచ్చింది ? దేశంలో రబ్బరంతా మా రాష్ట్రంలో పండుతూంటే దానితో వస్తువులు చేసే పరిశ్రమ యితర రాష్ట్రాలలో ఎందుకున్నాయి ?

కేరళ ప్రజలూ, ప్రభుత్వమూ సంకుచిత రాష్ట్రీయ తత్వాన్ని ప్రదర్శిస్తున్నారంటూ నిందించి, విశాల జాతీయ దృక్పథం గురించి ఉపన్యాసాలివ్వడం సరికాదు. దేశం వృద్ధి పొందకుంటే కేరళానికి అభివృద్ధి లేనట్లే, కేరళ వెనకబడివుంటే దేశానికికూడా నష్టమే.

ఈ అభిప్రాయంతోనే కేరళకు కేటాయించిన మొత్తాన్ని పెంచాలని కమ్యూనిస్టుపార్టీ తన ఎన్నికల ప్రణాళికలో వ్రాసింది. రెండో ప్రణాళిక కేటాయింపును 87 కోట్లనుంచి 200కోట్లకు పెంచాలంది. దేశం మొత్తంమీద లెక్క కడితే మన రాష్ట్రానికి 170 కోట్లు రావలసేవుంది. నిజంచేత జనసంఖ్యని పట్టిగాక జనసాంద్రతను పట్టి ఆలోచించాలి. జనసాంద్రత ఉత్పత్తి విషయంలోనూ, పంపకంలోనూ ఎన్నో చిక్కుల్ని తెచ్చిపెడుతూంది. ఈ రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలను కేంద్రీకరించి జరపవలసిన ఆవశ్యకతను కలిగిస్తూంది. ఆదృష్టితోనే 170కోట్లు గాక 200కోట్లు ఖర్చుచేయడం అవసరం అనిచెప్పింది.

జాతీయ ప్రణాళిక కొత్తచిక్కుల్ని ఎదుర్కొంటున్న దశలో మా ప్రభుత్వం అధికారానికి వచ్చింది. అదో దురదృష్ట కరమైన విషయం. జూన్‌లో జాతీయాభివృద్ధి మండలి సమావేశం, అయినప్పుడు ఈ కొత్త ఇబ్బందుల్ని గురించి తల పట్లు పట్టవలసి వచ్చింది. దేశంలోని సహజ సంపదలను పంచడం లోనూ, వినియోగంలో పెట్టడంలోనూ చాలా చాలా పొదుపుగా వుండాలని జాతీయాభివృద్ధి మండలి సభ్యులందరూ ఏకాభిప్రాయం తెలిపేరు. అందుచేత మా ప్రభుత్వం అవసర మనుకొన్న దానికన్నా చాల తక్కువ సొమ్మునే అంగీకరించింది. మేము ప్రణాళికాసంఘం వారితో మాట్లాడినప్పుడు కొన్ని చాలా ముఖ్యమైన పనులకు ధనం చూడవలసిన అవసరాన్ని తెలియపరచాము. ఆ ప్రకారం అయితే ఇదివరకు కేటాయించిన 87 కోట్ల రూపాయలూ గాక మరో 40 కోట్లు కావలసివస్తుంది.

ఇంక రెండో పంచవర్ష ప్రణాళికలో వున్న రెండో లోపం చూద్దాం: ప్రణాళికాసంఘం దేశం మొత్తానికి తయారుచేసిన ప్రణాళికలోనిపద్ధతిని కేరళరాష్ట్ర ప్రణాళికలో అనుసరించలేదు. భారీపరిశ్రమలను నిర్మించడం ఈప్రణాళికలలోని ఒక ప్రధానాంశం. ప్రణాళికకంతకూ కీలకం అదే. దాంట్లో కేరళకేమీ సంబంధం లేకుండాచేసేరు. ప్రజల అవసరాలకు కావలసిన వాడకం సరుకుల్ని మధ్యమరకం పరిశ్రమలూ చిన్న, గ్రామపరిశ్రమలూ వుత్పత్తి చెయ్యాలని ప్రణాళికా సంఘం అభిప్రాయం. కనీసం ఆ పరిశ్రమలు ఆభివృద్ధి కోసమైనా కేరళలో తగిన ఏర్పాట్లు జరగలేదు. జాతీయ ప్రణాళికలో పరిశ్రమల రంగానికి 18 శాతం ధనం కేటాయించేరు. కాని, కేరళ ప్రణాళికలో పరిశ్రమలకోసం కేటాయించినది చాలా కొద్ది మాత్రమే. ఈ విధంగా పరిశ్రమలకు ప్రాముఖ్యత యివ్వకపోవడమే కాదు. రోడ్లు, రహదార్లు. చదువు మెదలయినవాటికి అవసరంకన్న ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేరు. వ్యవసాయోత్పత్తి ఎక్కువ చేయాలనేదానికికూడా తగినంత ప్రాముఖ్యం ఇవ్వలేదు. మొత్తం రాష్ట్ర ప్రణాళికావ్యయం 87 కోట్ల రూపాయలలో పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ మినహాయించి మిగిలిన రంగాలకు పెద్ద మొత్తాలను ఇచ్చేరు, అంటే అనుత్పాదక రంగాలకుఅధిక శాతం సొమ్ము ఖర్చుచేస్తున్నారు. దేశంలోని పాదార్థిక సంపదలనూ, జనసంపదనూ వినియోగించుకోవడంలో జరుగుతున్న అవకతవకలను తగ్గించగల రంగాలకు కేటాయించినది కొద్దిమొత్తం మాత్రమే.

ఈ సందర్భంలో ఒకటి చెప్పాలి. ప్రణాళికా వ్యయాన్ని రాష్ట్రాల మధ్య సర్దడంలో జరిగిన ఈ అవకతవకలకు బాధ్యత కేవలం ప్రణాళికా సంఘానిదే కాదు. మా రాష్ట్రంలోని ప్రజా నాయకులకు ఈ విషయంలో ప్రధానభాధ్యత వుందని చెప్పాలి. తమ ప్రాంతంలో ఓ స్కూలో, ఓ రోడ్డో నిర్మింపచేసుకోవడమే వారిలో చాలామందికి ముఖ్యం అనిపించింది. పారిశ్రామిక, వ్యావసాయికోత్పత్తిని హెచ్చుచేసే పథకాలు వారికి పట్టలేదు. ఈ విషయంలో మా రాష్ట్రంలోనినాయకులు తీసుకున్న ధోరణికన్న ప్రణాళికా సంఘమే మంచిగా ఆలోచించింది. మా రాష్ట్ర నాయకులు అనుత్పాదక కార్యక్రమాలకు ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ, ఉత్పాదక కార్యక్రమాలను నిర్లక్ష్యం చేస్తున్నారని ప్రణాళికా సంఘమువారు పలుమార్లు హెచ్చరించేరు.

కనీసం ఇక ముందయినా ఇల్లా జరగకూడదు. రాబోయే పంచవర్ష ప్రణాళికలలో వ్యయం ఉత్పాదక, అనుత్పాదక రంగాల మధ్య ఏ విధంగా పంచాలో, ఉత్పాదకరంగాలలో కూడా వ్యవసాయానికీ, పరిశ్రమలకూ మధ్య పంపిణి ఎలా వుండాలో ప్రజలకు తెలియాలి. ఆ విధంగా ప్రజాభిప్రాయాన్ని నిర్మించే బాధ్యత ప్రభుత్వం మీద వుంది రాజకీయ పార్టీలను, ప్రజాసంస్థలను, ప్రముఖ వ్యక్తులను తోడుచేసుకొని మేము ఈ భాధ్యతను నిర్వర్తించాలి. కాని, ప్రణాళికాసంఘం కేరళలో పరిశ్రమలను వృద్ధిపరచే కర్తవ్యాన్ని నిర్లక్ష్యంచేయడం కూడా కేరళ ప్రణాళిక ఈ విధంగా ఒరుగొమ్ము కావడానికో కారణం.

వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకొని, రెండో ప్రణాళికను తయారు చేయడంలో కలిగిన నష్టాన్ని సాధ్యమైనంత వరకు కూడదీసుకునేటందుకు మా ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ప్రజలకు కలుగుతున్న కష్టాలను కొంతవరకైనా తగ్గించేటందుకుపయోగపడే ఆర్థికరంగాలను వృద్ధిపరచడానికి యథాశక్తి కృషిచేస్తుంది.

# 3

# పారిశ్రామికీ కరణ : కార్మిక విధానం

పరిశ్రమలు బాగా వృద్ధిపొందడానికి కావలసిన హంగు లన్నీ మాకున్నాయి. అయినా మా ప్రజలలో అత్యధిక భాగం నిరుద్యోగులుగా వున్నారు. అందుచేతనే, దేశంలో పరిశ్రమల్ని అతివేగంగా వృద్ధిపరచేటందుకు ప్రణాళికా సంఘం తయారు చేసిన పథకం విజయం పొందాలని మిగిలిన రాష్ట్రాలకన్నా మేం ఎక్కువ శ్రద్ధ చూపిస్తున్నాం. కాని, రెండో పంచవర్ష ప్రణాళికలలో ధనాన్ని కేటాయించడం పూర్తి అయిపోయేక మా ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. అదో విచారకరమైన విషయం. దేశం మొత్తంమీద పరిశ్రమల రంగానికి కేటాయించిన సొమ్ములో మా రాష్ట్రానికిచ్చినది చాల తక్కువ అని పైన చెప్పేను. ఈ పరిస్థితులతో మేం చేయగల దొక్కటే. మరో రాష్ట్రంలో నిర్మించడానికిదివరకే నిర్ణయం జరిగివుండని పరిస్థితులలో, ప్రభుత్వ రంగంలో స్థాపించదలచిన ప్రధాన పరిశ్రమ నేదో ఒకదానిని మారాష్ట్రంలో పెట్టవలసిందని కేంద్రప్రభుత్వంమీదా, ప్రణాళికా సంఘంమీదా ఒత్తిడి తేవాలి. అదేదారి

ఉదాహరణకు రెండో నౌకానిర్మాణ కేంద్రాన్ని తీసుకొందాం. దానిని నిర్మించాలంటే కొచిన్‌కన్న మంచి

మంచి స్థలంలేదు. సాంకేతికంగా చూస్తే అదే అన్ని చోట్లకన్న మంచిది. రెండు ప్రణాళికలలోనూ కూడ ప్రాజెక్టులను కేటాయించడంలో కేరళకు అన్యాయం జరిగిపోయిందనీ, అందుచేత నౌకానిర్మాణ కేంద్రాన్ని స్థాపించడంలో కేరళ విషయం ప్రత్యేకంగా పట్టించుకోవాలనీ కూడ మేము వాదిస్తున్నాం. రబ్బరుటైర్లు తయారుచేసే ఫ్యాక్టరీకూడ ఇక్కడ పెట్టాలని మేము కోరుతున్నాం. దేశంలో పండే రబ్బరు ఇంచుమించు అంతా ఇక్కడే పండుతూంది. అందుచేత మా కోరికకు ప్రత్యేక శ్రద్ధ చూపాలసిన అవసరం వుంది.

ఆ విధంగా ప్రభుత్వరంగంలో స్థాపించబడే పరిశ్రమలలో న్యాయమైన వాటా కేరళకు ఇవ్వాలంటూనే, రెండోవేపున పరిశ్రమలలో పెట్టుబడి పెట్టడానికై ధనవంతులను ఆహ్వానిస్తున్నాం. ఆ వుద్దేశంతోనే పారిశ్రామిక విధానంగురించి ఒక ప్రకటన చేసేము. ఆ ప్రకటన తర్వాత మేము అనుసరిస్తున్న పద్ధతులు ఈ దిగువ అంశాలమీద ఆధారపడి వున్నాయి.

(క) 1956 ఏప్రియల్ 30 వ తేదీన పరిశ్రమల విధానం గురించి భారతప్రభుత్వం చేసిన తీర్మానాన్ని ప్రాతిపదికగా మాప్రభుత్వం తీసుకొంది. మరొకలాగ చెప్పాలంటే, అతి ప్రధానమైన పరిశ్రమలను మాత్రమే ప్రభుత్వరంగంలోకి తీసుకొని, అత్యధికభాగం పరిశ్రమలు ప్రైవేటు రంగానికి వదిలి వేస్తాం.

(ఖ) అత్యధికభాగం పరిశ్రమలను ప్రైవేట్‌రంగానికి వదలివెయ్యడమేకాదు. పరిశ్రమలను స్థాపించి, హేతుబద్ధమైన పద్ధతులలో వాటిని సాగించేటందుకు పెట్టుబడిదారులను ప్రోత్స

హిస్తాం, కావలసిన సౌకర్యాలు కలిగిస్తాం. న్యాయమైన రేట్లకు భూమి, నిర్మాణపరికరాలు, ముడిపదార్థాలు, విద్యుచ్ఛక్తి మొదలయినవి లభ్యమయ్యేటందుకు పెట్టుబడిదార్లకు మేము చేయగలిగిన సాయమంతా చేస్తాం. తగినంతగా ముడి పదార్థాలు దొరకకపోయినా, అప్పు విదేశమారకం మొదలయినవి సులభంగా లభ్యంకాకపోయినా ఆ చిక్కులు సరిదిద్దడానికి మేము సహాయపడతాం. తగు సందర్భాలలో ఫైనాన్షియల్ కార్పొరేషన్ల ద్వారా ఆర్థిక సహాయం లభించేటట్లు తోడ్పడతాం.

(గ) ప్రభుత్వ సహాయంతోనో, ప్రభుత్వ వాటా కలుపుకొనో పరిశ్రమల్ని స్థాపించే పద్ధతిని గురించి మేము బాగా ఆలోచిస్తున్నాం. మొత్తం వాటాలలో ప్రభుత్వం హెచ్చుగానే భాగం తీసుకొంటుంది. పెట్టుబడులిచ్చే సంస్థలనుంచి అప్పులు దొరికేటందుకు అవసరమైన హామీలిస్తుంది. ఇతర విధంగా ఏవన్నా చిక్కులుంటే సరిదిద్దుతుంది.

యజమానులకూ, పనివారికీ మధ్యవుండే సంబంధాల సమస్యను చక్కదిద్దడానికై మేము అనుసరించదలచిన మా పారిశ్రామిక విధానంలోకల్లా అతిప్రధానం. కార్మికులతో తగాదాలు తప్పవనీ, మొదలుకు నష్టం కలగకుండా పెట్టుబడి పెట్టడం సాధ్యంకాదనీ పారిశ్రామిక యజమానులు బెదురుతున్నారు. అందుచేత యజమాని - కార్మిక సంబంధాల పరిష్కార పద్ధతిమీద పరిశ్రమలు వృద్ధిపొందేదీ మానేదీ ఆధారపడి వుంది. మేం ప్రభుత్వాధికారానికి వచ్చామనేసరికి రాష్ట్రంలోనూ, వెలుపలా కూడ పరిశ్రమల యజమానులకు భయం పట్టుకొంది.

ఈ భయానికీ ఆధారం లేదని మా ప్రభుత్వం మాట లలోనే గాక క్రియలో కూడ చూపించింది. మా విధానంలో కార్మిక తగాయిదాలు శాంతంగా, అతివేగంగా పరిష్కారం అవుతాయని నిరూపించేము. గత శాసన సభా సమావేశ కాలంలో ఈ సమస్యపై సభ్యులు వేసిన ప్రశ్నలూ, వాని కిచ్చిన సమాధానాలూ ఒక్కసంగతిని స్పష్టం చేసేయి. మా ప్రభుత్వం ఏర్పడేనాటికి 807 పారిశ్రామిక తగాయిదాలు విచారణలో వున్నాయి. ఏప్రిల్, మే, జూన్, జులై నెలలలో మరో 1332 క్రొత్త తగాయిదాలు బయలుదేరేయి, వీటిలో 2089 తగాయిదాలు సామరస్య పూర్వకంగా పరిష్కారం అయ్యేయి. 50 కేసులుమాత్రమే పరిష్కారానికి వెళ్ళేయి.

ఇంతమాత్రం చాలదని మాకు తెలుసు. ఫ్యాక్టరీలవారీ గానూ, పరిశ్రమల వారీగానూ, ప్రాంతాల వారీగానూ పారి శ్రామిక తగాయిదాలను పరిష్కరించడం ఒక్కటే చాలదు. అసలు తగాయిదాలు రాకుండానూ, తగాదాలువచ్చి ఉత్పత్తి ఆగిపోకుండానూ చేసి తగు పారిశ్రామిక వాతావరణాన్ని సృష్టించగలిగినప్పుడే పరిశ్రమలు వేగంగా వృద్ధిపొందుతాయి. పరిశ్రమల యజమానుల్నీ, కార్మికసంఘాల్నీ సమ్ముఖపరచి పరిశ్రమలలో సాధ్యమైనంతవరకు తగాదాలు రాకుండేటట్లు చెయ్యడంలో తోడ్పడితేనే అది సాధ్యం. పరిశ్రమలలో శాంతి నెలకొనాలంటే, కనీసంగా తగాదాల విరమణ జరగాలంటే యజమానులు కార్మికుల న్యాయమైన కోరికల నంగీకరిస్తూ, కార్మికుల పని నిలిచిపోకుండేటందుకూ, యథాశక్తి ఉత్పత్తిని హెచ్చించేటందుకూ ప్రయత్నిస్తూ పరస్పరం ఒప్పందానికి రావాలి. ఈ విధంగా పరస్పరం ఒప్పందానికి రావడం సులభ

మని మేము అనుకోవడంలేదు. ఆ విధంగా తగాదాల విరమణ నేర్పరచుకొనేటందుకు జరపవలసిన రాయబారాలలో అనేక చిక్కులు వస్తాయి. కాని దానికి సంబంధించిన వాళ్ళంతా శ్రద్ధా, ఓపికా చూపిస్తే ఇటువంటి ఒప్పందాలు జరగడం అసాధ్యంకాదు. దీనికోసమే మా ప్రభుత్వం పూనుకొంది.

ఈనాటి పరిస్థితులలో జాతీయార్థిక వ్యవస్థను బాగు పరచడంలో కార్మిక వర్గానికున్న బాధ్యతను రాష్ట్రంలోని కార్మిక సంస్థలన్నీ గుర్తించిననాడే తప్ప ఈపని సానుకూల పడదు. కొత్త పరిశ్రమలను ప్రారంభించడం యజమానుల కెంత అవసరమో తమకూ అంతే ఆవసరమని వారు గుర్తించాలి. నిజానికి నూతన పరిశ్రమలు వృద్ధిపొందడం కార్మికులకే చాల ముఖ్యం. త్వరగా పరిశ్రమలు వృద్ధిపొందినప్పుడే నిరుద్యోగ సమస్యను విజయవంతంగా పరిష్కరించగలుగుతాం. కార్మిక వర్గ సమస్యలకల్లా కీలకం అదే. అందుచేత పారిశ్రామిక శాంతి నెలకొనాలనే విధానం గురించి కార్మికసంఘ కార్యకర్తలంతా పూనుకొని ప్రచారం చేయాలి.

యజమానులు తమ దృక్పథాన్ని మార్చుకొంటే తప్ప కార్మికసంఘ కార్యకర్తలు పారిశ్రామిక శాంతి కోసం కార్మికులలో ఎంత ప్రచారం చేసినా ప్రయోజనం లేదు. పారిశ్రామిక శాంతి ఉపన్యాసాల వలన రాదు. ఆ పేరు చెప్పి తమ న్యాయమైన కోరికలకు సున్న చుడుతున్నారని కార్మికులను కొంటే ఇంక శాంతి సాధ్యంకాదు. కార్మికుల మీద భార మంతా పడేసి, లాభాలు జేబులో వేసుకోడానికి తాము ప్రయత్నించడం లేదనే భావం యజమానులు తమ చర్యల ద్వారా కార్మికులలో కలిగించాలి. జీతాలలో న్యాయంగా

రావలసిన పెరుగుదలను, బోనసులు వగైరాలను కార్మికుల కివ్వడానికి తాము వెనుదీయడం లేదని యజమానులు కార్మికులలో విశ్వాసం కలిగించాలి.

ఒక ఫ్యాక్టరీలోనో, ఒక పరిశ్రమలోనో కాకుండా రాష్ట్రం మొత్తంమీద యజమానులకూ, కార్మికులకూ మధ్య ఆమాదిరి ఒప్పందం కుదిరేటట్లు చూడాలని ప్రభుత్వం ఆలోచన. దీని అవసరం అటు యజమానులకూ, ఇటు కార్మికులకూ కూడా నిత్యం అనుభవం అవుతూంది. ఆ అనుకూల పరిస్థితులను ఉపయోగించుకొని పరిశ్రమలలో వాతావరణాన్ని మార్చేటందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తూంది.

పరిశ్రమలలో ఈ మాదిరి వాతావరణం ఏర్పడాలంటే ముందు కార్మికవర్గంలో ఐక్యతరావాలి. ఇప్పుడు అనేక కార్మిక సంఘాలు పని చేస్తున్నాయి. తమలోతాము పోటీ పడుతున్నాయి. రాజకీయభేదాలు, కుల, జాతిభేదాలే ఈ పోటీలకు మూలం. ఈవైవిధ్యమూ, పోటీమూలంగానే కార్మికవర్గం ఐక్యంగా యజమానుల ఎదుట నిలబడి పారిశ్రామిక శాంతికి ఆటంకంగా వున్న అడ్డులను తొలగించలేకుండా వుంది.

కార్మికవర్గ నిర్మాణంలోవున్న ఈ అనైక్యత కార్మిక సంఘాల రోజువారీ కార్యక్రమాలలో ఎన్నో చిక్కులను తెచ్చిపెడుతూంది. అయినా అనేక సందర్భాలలో, అనేక పరిశ్రమలలో వివిధ కార్మిక సంఘాలు కలిసే పని చేస్తున్నాయి. ముఖ్యంగా తోటలలోని వివిధ కార్మిక సంఘాలు ఈ విధంగా ఐక్యంగా పనిచేస్తున్నాయి, ఈ విధంగానే బోనసులు సంపాదించేయి. పెద్ద భూస్వాములకూ తమకూ మధ్య తగాయిదాలు వచ్చినప్పుడు కుట్టనాడ్‌లోని వ్యవసాయ కూలీలు కూడా

ఆ విధంగా ఐక్యతతో పని చేసేరు. మొక్క జీడిపప్పు ఫ్యాక్టరీ పనివారూ అలాగే వ్యవహరించేరు. వివిధ కార్మిక సంఘాలకు, రాజకీయ పార్టీలకు చెందినప్పటికీ ఆ భేదాలు గణనలోకి రానంత తీవ్రంగా ఐక్యతావాంఛ వుంది.

శ్రామికుల ఐక్యతా వాంఛను పురస్కరించుకొని మా ప్రభుత్వం తన ప్రయత్నాలను సాగించింది. శాసన నిర్మాణం ద్వారా కార్మికవర్గంలో ఐక్యత బలపడడానికీ తోడ్పడదలచింది. ఈ వుద్దేశంతోనే కొత్తగా కార్మిక సంఘాల బిల్లును తయారు చేసి శాసనసభ ముందుకు తెస్తున్నాం. ఈ బిల్లులోని ప్రధానాంశాలు :

1. ప్రభుత్వమూ, యజమానులూ ఇప్పుడున్న కార్మిక సంఘాలను అన్నింటినీ గుర్తించాలి-దానికి కావలసిన నిబంధనలు అందులో పొందుపరచబడినాయి.

2. ఎక్కువ యూనియన్లున్నచోట వాని నైక్యపరచాలి. ఆవిధంగా 'ఒక పరిశ్రమ కొక సంఘం' అనే ఆశయం నెరవేర్చాలి.

3. వివిధ కార్మిక సంఘాలున్నచోట పారిశ్రామిక తగాయిదాల పరిష్కార విధానాన్ని నిర్ణయించే నిబంధనలు.

4. వర్క్సు కమిటీల నిర్మాణం, ఆయా పరిశ్రమలలో పని పరిస్థితులను సక్రమ స్థితిలో వుంచే అధికారం వీనికి వప్పజెప్పబడుతుంది.

5. మేనేజిమెంట్ కౌన్సిళ్ళ నిర్మాణం, పరిశ్రమ కట్టుదిట్టంగా పనిచేసేటట్లు చేయడానికై ఈ కౌన్సిళ్ళలో పనివారికి తగుపాటి ప్రాతినిధ్యం వుంటుంది.



# 4

# చిన్న పరిశ్రమలూ - సహకార పారిశ్రామిక సంస్థలూ

అయితే, పైన వివరించిన పారిశ్రామిక విధానం వర్తించని పరిశ్రమలు ఎన్నో వున్నాయి. పరిశ్రమల వలన జీవిస్తున్న మనరాష్ట్ర జనాభాలో అత్యధిక భాగం చేతి పరిశ్రమలలోనూ గృహ పరిశ్రమలలోనూ పని చేసేవారే. వీటికి సంబంధించినంత వరకు యజమాని-పనివాడుకి పేచీలు లేవు. ఆ పేచీలమూలంగా పని నిలిచిపోవడంఅంటూనూ లేదు. వారు పనిసాగించే పని ముట్లు వారివే. అయితే వాళ్ళకున్న ఇబ్బందులు మరొక తర హావి. ముడి పదార్థాలను కొనుక్కునే టందుకు కావలసిన సొమ్ము సకాలంలో అప్పుగానైనా వారికి దొరకడం కష్టం. వాళ్ళు తయారుచేసిన వస్తువులు వేగంగా అమ్ముడయి సరి అయిన ధర రావడంలో ఇబ్బందులున్నాయి. యంత్ర పరిశ్రమ లతో వాళ్ళకి పోటీవుంది, ఇల్లాగే అనేక సమస్యలు. పెద్దఎత్తున సహకార పారిశ్రామిక సంస్థల్ని ఏర్పాటు చేస్తేనే ఈ సమస్యలు పరిష్కారం అవుతాయి.

అఖిలభారత చేనేత సంఘంవారి అధ్వర్యాన కొద్ది సంవత్స రాలలో దేశం అంతటా చేనేత సహకార సంఘాలు తల ఎత్తి

నాయి. అవి పొందిన విజయం చూస్తే చిన్న పరిశ్రమలలోనూ, కుటీర పరిశ్రమలలోనూ సహకార సంస్థలెంతో ఉపయోగ కరంగా వుంటాయని అర్థం అవుతుంది. తానే యజమానీ, తానే పనివాడూగా వున్న చేనేత పారిశ్రామికుడు ఎన్నో ఏళ్ళుగా ఎదుర్కొంటున్న ఇబ్బందులు ఈ చేనేత సహకార సంస్థలద్వారా పరిష్కారం అయ్యేయి. అల్లాగని చేనేత సహకార సంఘాల కార్యవిధానంలో లోపం లేదనికాదు. చాలా లోపాలున్నాయి. ఎన్నివున్నా అవి చేనేత పనివారికి తోడ్పడ్డాయి. మిగిలిన పరిశ్రమలలో కూడా అది ఆచరణీయం.

కేరళలో చేనేతవంటిదే, కొబ్బరిపీచు పరిశ్రమ ఒకటుంది. దానిలోకూడా ఇల్లాంటి సహకార సంఘాల్ని స్థాపించాలనేది మా ప్రభుత్వం ఆలోచన. మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు చేనేతకన్న కొబ్బరిపీచు పరిశ్రమ చాల ముఖ్యం. దాని మీద ఎన్నో లక్షలమంది బ్రతుకుతున్నారు. పైగా దానికి కావలసిన ముడిసరుకు మన రాష్ట్రంలోనే దొరుకుతుంది. చేనేతకల్లా కాదు, దానికి కావలసిన పత్తి కేరళలో పండదు. ఇప్పటివరకు కొబ్బరిపీచు పరిశ్రమలో పని చేస్తున్నవారిలో కొద్దివేలమంది మాత్రమే సహకార సంఘాలలో చేరేరు. కాని, కొబ్బరి పీచు తీసే పదిలక్షలమందిలో అత్యధిక భాగం ఏ సహకార సంఘం లోనూ చేరలేదు. పైగా, ఇప్పుడున్న కొబ్బరిపీచు సహకార సంఘాలలో వర్తకులూ, పీచుపని చెయ్యని తదితరులూ కూడ చేరేరు. వారంతా తమ సభ్యత్వంద్వారా పీచుపనివారినివర్తకుల ఫ్యాక్టరీ యజమానుల దోపిడినుంచి కాపాడడంలో తోడ్పడడా నికి బదులు, దోపిడీకి గురిఅయ్యేటట్లు చెయ్యడంలో తోడ్పడు తున్నారు. అడుగడుగునా పీచు పనివారి నెత్తిన చెయ్యిపెట్టి

సాధ్యమైనన్ని ఎక్కువ లాభాలు జేబులో వేసుకోవాలని పెద్ద భూస్వాములు, వ్యాపారులు ప్రయత్నిస్తున్నారు. వారి దోపిడి నుంచి ఆత్మరక్షణ చేసుకోడానికై సహకార సంఘం పీచు పని వారికి సహాయపడాలి. సహకార సంఘాలను ఏర్పరచే వుద్దేశం అది. సరిగ్గా ఆ సంఘాలు ఆపని చేసేటట్లు చూస్తుంది, మా ప్రభుత్వం. అంటే ఒకవేపున కొబ్బరిపీచు సహకార సంఘాలలోకి పనివారు కానీవారు చేరకుండా చూడాలి. రెండోవేపున సంఘాలను విస్తృతంగా ఏర్పాటుచేసి, పనివారినుంచి సభ్యులు బాగా చేరేటట్లు ప్రోత్సహించాలి.

సహకార పారిశ్రామిక సంఘాలు విజయం పొందగల మరొకటి చేపల పరిశ్రమ. ఇందులోకూడా, చేపలు పట్టేవారిలో అత్యధిక సంఖ్యాకులీనాడు సహకార సంఘాలలో చేరి వుండనే లేదు. దానికి ఫలితంగా చేపల వలలు, పడవలు, ఇతర పనిముట్లు కలిగివున్న మధ్య దళారుల దోపిడికి వారు నేడు అమితంగా గురి అవుతున్నారు. పైగా వాతావరణం ప్రతికూలంగా వుంటే వారాల తరబడి వేటకి పోలేక ఇళ్ళవద్దే మాడిపోతూ పడివుంటారు. వీరికి సాయం జరగాలంటే సహకార సంఘాలే మార్గం. వలలు, పడవలు, పరికరాలు కొనుక్కొనేటందుకు వీని ద్వారా చౌక వడ్డీకి అప్పులు దొరుకుతాయి. వారు వేటాడి తెచ్చినవాటిని అమ్మే ఏర్పాట్లు చేస్తాయి. పైగా సహకార సంఘాలలో చేరడం మూలంగా సాంఘికంగానూ, సాంస్కృతికంగానూ కొంత ముందుకు రాగలుగుతారు.

చేనేత, కొబ్బరిపీచు, చేపల పరిశ్రమలు గాక ఇంకా ఎన్నో పరిశ్రమలూ, వృత్తులూ సహకార సంఘాలద్వారా లాభం పొందేవి వున్నాయి. సహకార పారిశ్రామిక సంస్థల

నిర్మాణం పెద్ద పెద్ద పరిశ్రమల నిర్మాణానికన్న ఏమాత్రం అప్రధానం కాదు. ఒకవిధంగా చూస్తే వానికన్న ప్రధానమే కూడ. పెద్ద పెద్ద పరిశ్రమల నిర్మాణం సాగిస్తే కొంతకాలానికి మనం ఆర్థిక చిక్కులనుంచి బయట పడతాం. ఇప్పుడు చిన్న పరిశ్రమలలోనూ, కుటీర పరిశ్రమలలోనూ జీవిస్తున్న లక్షలమంది పనివారిని సరియైన నిర్మాణంలోకి తెస్తే తక్షణ సమస్యలు చాలవరకు పరిష్కారం అవుతాయి. జాగ్రత్తగా ఆలోచించి సహకార పారిశ్రామిక సంస్థల్ని బాగా పని చేయిస్తే ముఖ్యంగా పల్లెటి ప్రాంతాలలోవున్న నిరుద్యోగ పీడ చాలవరకు తగ్గుతుంది. రెండోవేపున జనావసర వస్తువుల వుత్పత్తి పెరుగుతుంది. అవి కరువు కావడంచేతనే నేడు మన దేశంలో ద్రవ్యోల్బణ పరిస్థితి పీడాకరంగా వుంది. అందుచేత మా ప్రభుత్వం సహకార పారిశ్రామిక సంస్థలను వృద్ధిపరచడానికై శక్తివంచన లేకుండా కృషి చేస్తుంది.



# 5

# వ్యవసాయోత్పత్తీ - భూ సంస్కరణాలూ

నేడు మన రాష్ట్రంలో ఆహార కొరత చాల తీవ్రంగా వుంది. ఇది నిజానికి యావద్భారత సమస్య. దేశం మొత్తం మీదనే ధాన్యం పంట తక్కువ. ధాన్యం తినే రాష్ట్రాలన్నింటా ఈ చిక్కులున్నాయి. ముఖ్యంగా మన రాష్ట్రంలో మరీను. ఎంతో ఎక్కువ అంచనా వేసినా మనకు కావలసినదాంట్లో సగమే మన రాష్ట్రంలో పండుతూంది. ప్రజానీకంలో అత్యధిక భాగం తమ ఆహార పదార్థాలకోసం బజారు కెక్కవలసిందే.

ధాన్యాన్నంతనీ సేకరించి, పూర్తిగా రేషనింగును అమలు జరపడంద్వారా ఈ సమస్యను పరిష్కరించడానికి యుద్ధంరోజుల్లో అప్పటి ప్రభుత్వం పూనుకొంది. బజారులో దొరికే ధాన్యానికి తోడుగా చౌకడిపోలలో (ప్రభుత్వ సబ్సిడీల ద్వారా) తక్కువ రేటుకు బియ్యం సరఫరా చేసి ఈ సమస్యను పరిష్కరించడానికై నేటి ప్రభుత్వం పూనుకొంది. ధాన్యం సరఫరా కష్టతరమని అంతా చెప్తున్నారు. ఈ స్థితిలో ప్రభుత్వం చేయవలసిందేమిటి ?-అనేదే అందరినోట్లో నలుగుతూంది. దీనికి వెంటనే సమాధానం ఇవ్వడం సులభంకాదు. అయితే ధాన్యం ఎక్కడ తేవాలి, ఎల్లా పంచాలి అనే ప్రశ్నలవంటివే

ధాన్యం ఉత్పత్తి మాటేమిటనేదికూడా. నిజానికీ వాటికిదే విధంగానూ తీసిపోయే సమస్యకాదు. అవసరంకన్న ఉత్పత్తి ఎంతో తక్కువగా వున్నప్పుడు పంపిణీ ఏర్పాట్లు ఎంత పకడ్బం దీగా చేస్తేమాత్రం లాభం ఏమిటి ?

అందుకే ఈ విషయంలో కొత్తపంథా తొక్కాలి. మా ప్రభుత్వం చేస్తున్నదదే. కేరళలో ధాన్యంపంట ఇప్పుడున్నంత లోటుగానూ వుండక తప్పదనే వాదానికి నేను అంగీకరించను. ఈనాడు పంట చాల తక్కువగా వుంటూందని వ్యవసాయం ఏమాత్రం తెలిసినవాళ్ళయినా ఒప్పుకొంటున్నారు, కొత్త వ్యవసాయ పద్ధతులు, ఉత్పత్తి పద్దతులు మన రాష్ట్రంలో చాల కొద్ది పరిమితి ప్రదేశాలలోనే ప్రవేశ పెట్టబడుతున్నాయి. వాటిని విస్తృతంగా అమలు జరిపితే పంటలు బాగా పెరుగు తవని అంతా ఎరుగుదురు. ఈ నూతన పద్ధతుల ద్వారా 30 శాతం పంట హెచ్చించవచ్చుననీ, అదనంగా కొత్త బీడు భూములను సాగులోకి తెచ్చి, వ్యవసాయంలోకి తెచ్చి మరి కొంత ఎక్కువ పండించవచ్చుననీ వ్యవసాయ నిపుణులు అంచ నాలు వేస్తున్నారు. కాని ఒక ప్రశ్న రాకమానదు - ఈ అంచనాలన్నీ నిజమా ? ఆచరణలో సాధ్యమేనా ?

సాంకేతిక విషయాలొక్కటే ఆలోచించి ఈ ప్రశ్నలకు "ఔను, కాదు." అని తేల్చి సమాధానం చెప్పెయ్యడం సాధ్యం కాదు. ఆధునిక పద్దతుల్నీ, విధానాల్నీ, ప్రజలు అంత విస్తృత రూపంలో అమలు జరపడం అంటే మాటలుకాదు. ఆర్ధిక, సాంఘిక, నిర్మాణ సమస్య లెన్నింటితోనో అది ముడిపడివుంది. ఎవరో కొద్దిమంది "ఆదర్శప్రాయులూ", "అభివృద్ధికాములూ"

అయిన రైతులు వీటిని అమలులో పెడితే చాలదు. వాళ్ళిద్దరకే ఆ పద్ధతులను చేబట్టి లాభాలు గడించేరు. కాని లక్షలకొలది మంది సాధారణ బీదరైతాంగానికి ఈ కొత్త పద్ధతులు, పనిముట్లు అర్ధంకావు. అర్ధం అయినా వానిని అమలు జరిపే ఆర్థిక స్తోమత వాళ్ళకి వుండదు. వాటినిగురించి చెప్పి, వాటి నుపయోగించగల స్తోమతు కలిగిస్తే పంట ఎక్కువవుతుంది.

ఈ విషయాన్ని ప్రణాళికాసంఘం గుర్తించింది. కమ్యూనిటీ ప్రాజెక్టులనీ, జాతీయ విస్తరణ పథకాలనూ ప్రవేశపెట్టిన దిందుకోసమే. నూతన పద్ధతులు, పనిముట్లు, నిర్మాణముద్వారా ఎటువంటి లాభాలున్నాయో, వానివలన ఉత్పత్తి ఎలా పెరుగుతుందో రైతాంగానికి పై ప్రాజెక్టులూ, విస్తరణ పథకాలూ నేర్పుతాయని వారు అభిప్రాయపడ్డారు. బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు నాయకత్వాన అనేకమంది ఎక్స్టెన్షన్ సర్వీసు ఆఫీసర్లు ఈ పనిని సాధించడానికే నియమించబడ్డారు. మహిళా సమాజాలు, యువజనసంస్థలు మొదలయిన ప్రజాసంస్థ లనేకం ఏర్పరుస్తున్నారు. కాని, దురదృష్టవశాత్తూ ఈ వుద్యమం ఈ విషయంలో ఏమాత్రం ఫలప్రదం కాలేదు. కమ్యూనిటీ ప్రాజెక్టుల్నీ, జాతీయవిస్తరణ పథకాల్నీ నిర్వహించేటందుకు నియమించబడిన బలగం అంతా ప్రభుత్వపు అదనపు సిబ్బందీ తప్ప వేరుకాదనే భావం ప్రజలలో ఏర్పడిందంటే అతిశయోక్తి కాదు.

అయితే ఈ వుద్యమాలలోని లోపం ఏమిటి? వాటినెల్లా బాగుపరచాలి? ఏ పద్ధతిలో పునర్నిర్మించాలి? - వాని నిర్మాణంలో ఖచ్చితంగా తెచ్చి తీరవలసిన మార్పులేమిటి? -

ప్రాజెక్టుల పనిని గురించీ, పథకాల పనిని గురించీ పరిశీలించే టందుకై ప్రణాళికా సంఘం నియమించిన ఉపసంఘం నేడు ఈ సమస్యలనే పరిశీలిస్తూంది. వాళ్ళు ఏం తేలుస్తారో నేనూహించి చెప్పబోవడంలేదు. ఈ సమస్యల నిట్లా పరిష్కారించా లంటూ సూచనలు చేయబోవడమూలేదు. పల్లెటి ప్రాంతాల బీదప్రజానీకం యొక్క ఆలోచనా ధోరణిలో మార్పు తేగలిగితే తప్ప కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్మాణంలోనూ, జాతీయ విస్తరణ పథకాల నిర్మాణంలోనూ ఎన్ని మార్పులు తెచ్చినా లాభంలేదని మాత్రం చెప్పవచ్చు. ఎక్కడో కూర్చునివుండే ప్రభుత్వంగాని, ఉండీ, ఉడీగీ ఓమారు వచ్చి చూసిపోయే ప్రభుత్వోద్యోగులు గాని పల్లెటూళ్ళ పరిస్థితులను చక్కబరచలేరనీ, తామే తమ భవిష్యత్తుకు కర్తలనే చైతన్యం గ్రామాలలో వుండే కూలీలకు, వ్యవసాయ కూలీలకు, బీదరైతులకు, వృత్తి పనుల వారికి, స్కూలు టీచర్లు వగైరా పల్లెటూళ్ళలోని విద్యావంతులకు, చిన్న చిన్న వ్యాపారస్థులకు కలిగించాలి. తమ సాంఘిక జీవితాన్ని సర్వతోముఖంగా వికసింపచేసుకొనే టందుకై పథకం వేసుకొని ప్రజలు పనిచేసుకొనేటప్పుడు ప్రభుత్వమూ, వుద్యోగులూ ఉపకరణ మాత్రంగానే వుపయోగపడ గలవు గాని వేరుకాదని వారు అర్థం చేసుకొనేటట్లు చెయ్యాలి. అప్పుడే వ్యవసాయోత్పత్తిని ఎక్కువ చేయడంలో వచ్చే సమస్యలు పరిష్కారం అవుతాయి.

ఈ దృష్టితోనే భూసంస్కరణలకు అంత ప్రాముఖ్యత వుందనడం. భూసంస్కరణలు తెస్తే పల్లెటూరి బీదప్రజలపై వున్న ఆర్థికభారం కొంత తగ్గుతుంది. పల్లెటూళ్ళలోవుండే

ప్రధాన సంపద భూమేకదా, దానిని కొద్దిగొప్ప తేడాలో సమానంగా పంచిపెట్టడం అవుతుంది. సాధారణప్రజల ఆర్థిక పరిస్థితులు కొంత బాగుపడతాయి. దేశంలో కొనుగోలు, అమ్మకం విస్తరిస్తాయి. అంతతో అవదు. అసలు గ్రామీణ ప్రజలలో ఒక నూతన మానసికోత్సహం వృద్ధిపొందుతుంది. తమరొక యజమానులమనీ, తమ భవిష్యత్తును తామే దిద్దుకోగలమనే విశ్వాసం గ్రామీణప్రజానీకంలో కలుగుతుంది. గ్రామాలలో వున్న కొద్దిమంది ధనికులలో ధనిక కుటుంబాలలో మాత్రం సర్వశక్తివంతములనీ, వారిముందు వేలకొద్దిగా వుండే బీదప్రజానీకం చేతులు నలుపుతూ బ్రతకవలసిందే ననేభావమూ, నిస్సహాయస్థితీ తొలుగుతుంది. ఈ నూతనశక్తితో పాటు నూతన బాధ్యతలనుకూడా తెలుసుకొంటారు. తాము తమశక్తిని ఎంత వినియోగిస్తే తమ కష్టాలు అంతగా తీరుతాయని వారు గ్రహిస్తారు. వాళ్ళ మనస్తత్వంలో ఈ మాదిరిమార్పు వచ్చినప్పుడు కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ విస్తరణపథకాలూ (ప్రస్తుతం జరుగుతున్న చర్చలదృష్ట్యా మార్పులు చేసేక) బాగా పని చేస్తాయి. వాటిద్వారా గ్రామ్యాలలోని ప్రజలందరినీ నిర్మాణాలలోకి తేవడం సాధ్యపడుతుంది. ఉత్పత్తిని పెంచడంకోసం వారందరినీ సమీకరించడం సాధ్యమవుతుంది. పల్లెటూళ్ళ ఆర్థిక సాంఘికవ్యవస్థలో ప్రధానమైన మార్పులు వస్తాయి.

అందుకే మా ప్రభుత్వం భూసంస్కరణలకు విశేష ప్రాముఖ్యం ఇస్తూంది. ఆ కార్యక్రమంలో ఒక ప్రధానమైన చర్య తీసుకొన్నదికూడా. మొదట ఆర్డినెన్సు ప్రకటించీ, తర్వాత చట్టంచేసి కౌలుదారు లెవ్వరినీ తొలగించకుండా నిషేధించింది.

ఇప్పుడొక సమగ్రమైన భూసంస్కరణల బిల్లును తయారు చేస్తూంది. త్వరలోనే దానిని శాసనసభ ముందుంచుతుంది. బిల్లులోని అంశాలను బయటపెట్టకుండానే, ఆ బిల్లును తీసుకు రావడంలోగల వుద్దేశాలేమిటో చెప్పుకో వచ్చును. ఈ బిల్లు యొక్క వుద్దేశాలివి.

1. కౌలుదార్లకి (సరాసరి కౌలుకి తీసుకొన్నా, మధ్య దళారులు ఎందరున్నా) భూస్వాముల దోపిడినుంచి తగినంత రక్షణ లభించాలి. ఇప్పుడు కౌలురేట్లు చాల ఎక్కువగా వున్నాయి అవి తగ్గాలి. కౌలురేటు స్థిరపరచాలి.

2. కౌలుదార్లకి రక్షణ ఇస్తూనే చిన్న భూస్వాముల విషయం గమనికలో పెట్టుకోవాలి. వీరికీ కౌలుదార్లకీ మధ్య వుండే సంబంధాలు పెద్ద భూస్వాములకీ వారికౌలుదార్లకీ మధ్యవుండే సంబంధాల మాదిరిగావుండవు. ఇదంతా చిక్కులతో కూడిన వ్యవహారమే. సందేహంలేదు. భూసంస్కరణలు జరగ వలసిందేనని చెప్పేవారంతా చిన్న భూస్వామికి న్యాయం జరిగేటట్టు చూడాలని ఒప్పుకొంటూరు. చిన్న భూస్వామి విష యంలో చూపించే ఈ మెత్తదనం కౌలుదార్లను పీడించే టందుకై ఒప్పుదల అయినట్లు కాకుండా చూసుకోవాలనికూడా అంతా చెప్తారు. చిన్న భూస్వామినీ, కౌలుదారునూ కూడ నూటికి నూరుపాళ్లూ సంతృప్తి పరచగల పరిష్కారమార్గం ఏదీలేదు. కాని, ఉభయులకూ కొంతకొంత వరకైనా సంతృప్తి కలిగించే మార్గం చూడాలి. ఉభయులకూ లాభకరమైన పరి ష్కారమార్గం బిల్లులోని క్లాజులూ, సబ్ క్లాజులూ ద్వారా బయట పడదు. అదో రాజకీయ సమస్య. రెండు పక్షాలవారూ

ఇచ్చి పుచ్చుకొనే సమన్వయ ధోరణిని కనబరచాలి. భూస్వామి-కౌలుదారు సంబంధాలు చక్కబడడం ఉభయులకూ లాభకరం ఆ దృష్టితోనే వ్యవహరించాలి. పరస్పరం లావాదేవీలలో ఈ సమస్యను పరిష్కరించగలిగేటట్లు తోడ్పడేటందుకు అనువైన క్లాజుల్ని బిల్లులో చేరుస్తున్నాము.

3. భూస్వాములకు కౌలుదార్లకు మధ్య సంబంధాలను చక్కదిద్దేటందుకై ప్రయత్నిస్తూనే రెండోవేపున విశేషమైన భూమి ఒక మనిషి అధీనంలోవుండే పద్ధతిని రద్దుచేసేటందుకు మేము ప్రయత్నిస్తున్నాము. భూమిస్వత్వానికి గరిష్ఠపరిమితిని ఏర్పరచి అదనపు భూమిని భూమిలేనివారికి, భూమి తక్కువగా వున్నవారికీ పంచేటందుకు ప్రయత్నిస్తున్నాము. రెండోవేపున నిర్ణీతమైన రేటున భూమి ఖరీదును భూస్వామికి చెల్లించి కౌలుదారు తానుచేసే భూమికి యజమాని అయ్యేటట్లు చేయడానికి తోడ్పడాలి. ఇదంతా సులభమైన పనేం కాదు. గరిష్ట పరిమితిని సరిగ్గా ఎంతో నిర్ణయించాలి. కొన్నభూమికి కౌలుదారు ఎంత ఇచ్చుకోవాలో నిర్ణయించాలి. ఇవన్నీ చిక్కులతో కూడిన పనులు. అయితేనేం. ఈనాడున్న సంధిగ్ధ పరిస్థితుల్ని చక్క పరచాలంటే ఆ చిక్కుల్ని ఎదుర్కోక తప్పదు.

సమగ్రమైన భూసంస్కరణల బిల్లును పైనచెప్పిన అంశాలతో ప్రవేశపెట్టడం ఒక్కటేకాదు. వెనకటి తిరువాన్కూరు, కొచ్చిన్ రాష్ట్రంలో ప్రారంభించిన కొన్ని ప్రయత్నాలను రూపొందించవలసివుంది. తిరువాంకూరు మహారాజా క్రిందా, ఆయన ఆధీనంలోని దేవాలయాలక్రింద వున్న శ్రీ పదమ్,

శ్రీ పండవరగై భూములకు సంబంధించిన బిల్లులు అల్లాగే వుండిపోయినాయి. వెనుకటి తిరువాన్‌కూరు కొచిన్ రాష్ట్రం లోని కనమ్‌భూములపై జన్మిల హక్కులను రద్దుచేసిన బిల్లు అలాగే వుండిపోయింది. ప్రస్తుతం వానిమీద మహారాజుకు, ఆయన క్రిందవున్న దేవాలయాలకు, జన్మిలకు సాలీనా ఇచ్చే కిస్తుకు ఏదో కొన్నిరెట్లు ప్రతిఫలంగా చెల్లింపచేసి వారి హక్కుల్ని రద్దు చేయడానికై ఈ బిల్లును ఉద్దేశించబడినాయి.

ఇవీ, ఇల్లాంటివే ఇతర భూసంస్కరణలూ ప్రజల మన స్తత్వాలలో మార్పులు తీసుకురావడానికి చాలాముఖ్యం. అయితే ఉత్పత్తిని బాగా వృద్ధిపరచాలన్నా, గ్రామీణ జీవి తాన్ని పునర్నిర్మించాలన్నా ఇవి పునాదిగా మాత్రమే వుప యోగ పడతాయి. అందుచేత ప్రభుత్వం చేతుల్లో వున్న భూముల్ని సరిగ్గా వుపయోగంలో పెట్టడంలో పెట్టడంకోసం కృషిచెయ్యడం ఎంతముఖ్యమో, రైతుల్ని వారివారి కను కూలమైన సహకార సంఘాలలోకి చేర్చడమూ, పడుచుకారు రైతు యువతీ యువకులకు విద్యనేర్పి తరిఫీదు నివ్వడమూ, నూతన పద్ధతులూ విధానాలూ నేర్పడమూ, సాంఘిక సాంస్కృతిక శిక్షణ నివ్వడమూ కూడ అంత ముఖ్యమైనవే. పల్లెటి ప్రాంతాలలో ప్రణాళిక ప్రధాన లక్ష్యం వ్యవసాయో త్పత్తిని హెచ్చించడం, ఆ పని నెరవేరాలంటే మార్గం అదొక్కటే.

# 6

# పరిపాలనా వ్యవస్థలో మార్పులు

రాష్ట్ర పరిపాలనా వ్యవస్థలో కొన్ని ప్రధానములయిన మార్పుల్ని తీసుకురావలసివుంది. అది చాలా ముఖ్యమైన పని. అది జరగనిదే పైన చెప్పిన ప్రజాతంత్ర విధానాలను అమలు జరపడం అసంభవం.

ఈనాటి పరిపాలనా వ్యవస్థ మనకు గత పరిపాలకుల నుంచి సంక్రమించింది. దానిలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులదీ, ఫ్యూడల్ ప్రభువులదీ ప్రధానమైన పెత్తనం. ఆ వ్యవస్థలో చాల లోపాలున్నాయని చాలకాలం నుంచి ప్రజాసంస్థలూ, వ్యక్తులూకూడ చూపిస్తున్నారు. దేశీ సంస్థానాధీశులూ, వారి దివాన్లూ ఇచ్ఛారాజ్యం చలాయించేరు. బ్రిటిష్ పాలకులు తమ పరిపాలనావ్యవస్థకు మూలస్థంభాలనుగా ఒక అధికారవర్గాన్ని నిర్మించారు. వారికి ప్రజలతో ఏమాత్రం సంబంధంవుండదు. బ్రిటిష్, ఫ్యూడల్ పరిపాలనలోని పోలీసులన్నా, అధికారులన్నా ప్రజానీకానికి తగనిభయం. ఏదన్నా మంచి జరగవలసివున్నా బోలెడంత జాప్యం, రెడ్ టేపిజం హద్దులేనంత. ఒక వుద్యోగి స్వంతవ్యవహారమైనా. చెయ్యితడి అయి పనిచేసినా పని నిముషాలలో జరుగుతుంది. లేకపోతే కదలదు. స్వాతంత్ర్యం రాక

పూర్వం పరిపాలనావ్యవస్థ ఇల్లా వుండేదని అందరూ ఎరుగుదురు. ఈ దురాచారాల్ని తొలగించాలని ప్రజాతంత్రోద్యమాలన్నీ కోరి పనిచేసేయి.

స్వాతంత్ర్యం వచ్చేక కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వాలు ప్రణాళికా బద్ధ అభివృద్ధిని సాధించాలని పూనుకొన్నాక పరిపాలనా వ్యవస్థలో మార్పులు తెచ్చి తీరవలసిన అవసరం మరీ ఎక్కువయింది. మన గమ్యాలను గురించీ, పంచవర్ష ప్రణాళికా శయాలను గురించీ పెట్టుకొన్న పెద్దపెద్ద ఆశలు సఫలం కావాలంటే ఇటు పరిపాలనా యంత్రమూ, అటు ప్రజాసంస్థలూ ప్రధానములయిన కర్తవ్యాలను నిర్వహించడానికి సమర్థములయి వుండాలని ప్రణాళికా సంఘం చెప్పింది. మొదటి ప్రణాళికా గమ్యాలనూ, ద్వితీయా ప్రణాళికా గమ్యాలనూ కూడ ఏ రాష్ట్రమూ సాదించలేకపోయిందని తేలిపోయింది. ఈ వైఫల్యానికి కారణం పరిపాలనాయంత్రం తన కర్తవ్యాల నిర్వహణకు తూగలేకపోవడమేనని కూడా స్పష్టపడింది. తిరువాంకూరు కొచీన్ రాష్ట్రంలో మొదటి ప్రణాళికలో 30 కోట్ల రూపాయలు వ్యయపరచడానికి పథకం వేసుకొన్నారు. కాని, నిజానికి వ్యయపరచినది 25 కోట్ల రూపాయలు మాత్రమే. రెండో పంచవర్ష ప్రణాళిక మొదటి సంవత్సరంలోకూడా వ్యయపరచ దలచుకొన్న దానికన్న చాల తక్కువే వ్యయపరిచేరు. పరిపాలనా యంత్రంలో సహజంగావున్న లోపాల్ని వెంటనే సరిదిద్దకపోతే రెండోఏడాదీ, మూడో ఏడాదికూడ ఇదే జరుగుతుంది. ఎన్ని పంచవర్ష ప్రణాళికలయినా అది అల్లాగే వుంటుంది.

మన ప్రభుత్వమూ, ప్రజలూకూడా ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థను నిర్మించుకోవాలనే భావాన్ని స్వీకరించడంతోనే మనదేశంలోని పరిపాలనా వ్యవస్థలో పెద్దమార్పులు వచ్చేయి. ఇప్పుడు పరిపాలనా శాఖల కార్యక్రమం స్వాతంత్ర్య సాధనకు పూర్వం నాడులాగ పన్నులు వసూలుచేయడం, పోలీసు బందోబస్తు చేయడం, న్యాయపాలన సాగించడంతోనే సరిపడదు. ఇవన్నీ పరిపాలనా శాఖలు చేయవలసిన ముఖ్య కార్యక్రమాలే వీనికితోడు దేశంలోని సహజ సంపదల్నీ, మనుజ సంపదను సక్రమంగా వుపయోగించడం అనే మరో చిక్కుసమస్యనుకూడా అవి విప్పవలసిన పనీ ఏర్పడింది. కాని, ఈ కొత్తపని తగిలింది గదా అని పరిపాలనా వ్యవస్థ నిర్మాణంలో అవసరమైన మార్పులేవీ రాలేదు. జిల్లాలలోనూ, దిగువనా రెవెన్యూ, పోలీసు, న్యాయశాఖ కార్యక్రమాలు సమైక్యంగా సాగిపోతున్నాయి. కాని, వానికి జాతీయాభివృద్ధి కార్యక్రమాలకూ పొత్తు కుదరడంలేదు.

నీటి పారుదల, రహదార్లు, రవాణాలు, పరిశ్రమలు, వ్యవసాయం సహకారం మొదలయినవాని అభివృద్ధికోసం ఎన్నో కార్యశాఖలు ఏర్పడ్డాయి. వీనికితోడు కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ విస్తరణ పథకాలూ వచ్చేయి. ఇన్ని వున్నా ఒకదానికొకటి పొంతనలేదు. పైగా ఇవన్నీ పరిపాలనా వ్యవస్థలో అంతర్భాగాలుగా తయారయి కూర్చున్నాయి. వీనిలో ఒకశాఖ తనకు తానుగా కొన్ని పనులను ప్రారంభించి చేసుకుపోతూంటే, ఆ పనులలో సహకరించవలసిన మరో శాఖకు దీని కార్యక్రమమే తెలియక ప్రతిబంధకమై కూర్చోడంకూడ జరుగుతూంది.

ఒక శాఖతో మరొక శాఖ, పరిపాలనా వ్యవస్థతో వివిధ శాఖలు సంబంధాలు పెట్టుకోకుండా ఎదురు బొదురుగా పని చేసుకుపోవడం అనేది బ్రిటిషు పాలకులు సృష్టించి స్వతంత్ర భారత ప్రభుత్వంచేత పెట్టిపోయిన పరిపాలనా వ్యవస్థలోని అధికారవర్గ దుర్విధానాలలోనూ, రెడ్ టేప్ జాప్యంలోనూ పరిణతి పొందినదే. స్వాతంత్ర్యం వచ్చేకయినా పరిపాలనా వ్యవస్థలో అధికారివర్గ దుర్విధానాలను తొలగించడానికి ప్రయత్నాలు ఏమీ జరగలేదు. దాని ఫలితంగా రెడ్ టేప్ జాప్యమూ అధికారవర్గ దుర్విధానాలూ యథాపూర్వకంగా సాగిపోతున్నాయి. రెండో వేపున అభివృద్ధి ప్రణాళికల నిర్వహణ కాసట బీసటగా వుండటంచేత వానిమధ్య పరస్పర సంబంధాలు లేకపోవడం మరింత ఆలస్యానికీ, అసమర్థతకీ మూలంగా తయారయింది. ఉదాహరణకి ఒక ప్రాజెక్టును నిర్వహించవలసి వుందనుకోండి. దానిని పూర్తిచేయాలంటే నీటి పారుదలశాఖ, రెవెన్యూ శాఖ, ప్రజారోగ్య శాఖ, విద్యాశాఖ కలిసి ఆలోచించి పనిచేయడం అవసరం. (వీనికితోడు ఆర్థిక శాఖ ఇతర శాఖల ఖర్చులను సరిచూస్తూ తోడ్పడుతూండడం తప్పనిసరి) ఆ ప్రాజెక్టు వివరాలను పరిశీలించి అనుమతించడానికై పై శాఖలన్నింటా కొద్దికొద్ది వారాలపాటు పట్టక తీరదు. ప్రభుత్వం కూడా అంతిమామోదం తెలిపేసరికి మరికొద్ది నెలలు పడుతుంది. అయినా ఆ ప్రాజెక్టును నిర్మించేటప్పుడు అడుగడుగునా వేర్వేరు శాఖలవారితో మళ్ళీ సంప్రదించడం అవసరమౌతూనే వుంటుంది. ఎక్కడ ఏపాటి ఆలస్యం జరిగినా, ఆ ఆలస్యం తప్పనిసరిగా తటస్థపడ్డాసరే ప్రాజెక్టుపని ఆగక తప్పదు, రాష్ట్రప్రభుత్వం వద్ద ఆలస్యంగా జరిగినా,

రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల సంబంధాలలో జరిగినా ప్రాజెక్టు పని నిలిచిపోతుంది. ప్రణాళికాసంఘం నిర్దేశించినట్లు ప్రణాళికా లక్ష్యాలు నెరవేరకుండా జరుగుతున్న ఆలస్యానికి మూలం ఇక్కడేవుంది,

అభివృద్ధి ప్రణాళికలను తయారుచేయడంలోనూ, నిర్వహించడంలోనూ పరస్పర సహకారం లేకపోవడంతో పాటు పరిపాలనా వ్యవస్థను ప్రజలకు సన్నిహితపరచలేక పోవడం కూడా జరుగుతూంది. ప్రణాళిక అన్నది అడుగునుంచి పైకి నిర్మించుకురావాలనీ, ప్రణాళిక యెడ ప్రజలలో వుత్సాహం కలిగించి, వారి సహకారాన్ని సాధించినప్పుడు అది తప్పక విజయం పొందుతుందనీ ప్రణాళికా సంఘం ఎన్నో సదుపదేశాలు చేస్తూంది కాని, ఎన్ని చేసినా ప్రణాళికను రూపొందించి నిర్వహించుతున్న వివిధశాఖలు అదివరకే అక్కడున్న అధికార వర్గంలో భాగాలూ, దానికి తోడునీడలూ అయి వూరుకున్నాయి. స్వాతంత్ర్య సాధనకు పూర్వంనాటి పోలీసు, రెవెన్యూ అధికారులకూ వ్యవసాయోద్యోగులకూ, తదితర విస్తరణ శాఖల అధికారులకూ పోలిక లేదు. వారు నిర్వహించే పనులు వేరు. కాని వారుపనిచేసే పద్ధతులలో తేడా ఏమీ లేదు. బ్రిటిష్‌పాలన కాలంలో జిల్లా అధికారులూ, దిగువ వుద్యోగులూ ఎల్లా పనిచేస్తూ వచ్చేరో ఇప్పుడూ అల్లాగే చేస్తున్నారు. ప్రజలు కూడా వాటి విషయంలో అల్లాగే వ్యవహరిస్తున్నారు. ఏదో పనికి ధనసహాయం చేయమని ప్రభుత్వాన్ని కోరడంతో ఈ అభివృద్ధి కార్యక్రమాలలో వారు చూపే ఉత్సాహం ఆఖరవుతుంది, వెనకటిరోజుల్లో రెవెన్యూ వుద్యోగులూ, పోలీసు అధికార్లు ప్రజాపీడకులుగా వుండేవారు.

వాళ్ళ బాధ్యతలటువంటివి. ఒకరిపని పన్నులు పిండడం - మరొకరి పని శాంతిభద్రతలు కాపాడడమూను, కాని, ఇప్పటి విస్తరణశాఖోద్యోగుల పని అది కాదు. ప్రభుత్వ సహాయాన్ని ప్రజలకు పంచడం వీళ్ళపని. అందుచేత ప్రజలకు సహాయకారులుగా వుండేఅవకాశం వుంది. కాని, వాళ్ళ దృక్పథంలో మార్పు లేదు. ప్రజలనుంచి డబ్బు వసూలు చేయడానికి బదులు అప్పుడప్పుడు కొద్దో గొప్పో వారికివ్వడం తప్ప వీరు పెద్దగా చేస్తున్నదేం లేదు. ఇదివరలో వుద్యోగుల లోపానికి గురికాకుండేటందుకై ప్రజలు వారి ఎదుట చేతులు నలిపేవారు. ఇప్పుడు అధికారుల దయకు పాత్రులయ్యేటందుకై వారి ఎదుట చేతులు నలుపుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో వ్యవసాయం మీదా, గృహపరిశ్రమల మీదా ఆధారపడివున్న మన ఆర్థిక వ్యవస్థను ఆధునిక పరిశ్రమలమీదా, వ్యవసాయంమీదా ఆధారపడివుండే అర్థిక వ్యవస్థగా రూపొందించగలగడం ఇంచుమించు అసంభవం.

మన జాతీయ ప్రణాళికలను కొనసాగించడానికై పరిపాలనా వ్యవస్థలో మార్పులు తేవడం చాల ముఖ్యమనే సంగతిని మా ప్రభుత్వం గుర్తించింది. అందుకనే ఆ మార్పులు తీసుకురావడానికంత ప్రాముఖ్యం ఇస్తూంది. ఈ సమస్యను పరిశీలించి, ఆరునెలల లోపున నివేదిక నివ్వవలసిందని ఒక ఉపసంఘాన్ని నియమించింది, ఈ ఉపసంఘం నివేదిక వచ్చేవరకూ కూర్చోకుండానే మా ప్రభుత్వం పరిపాలనా వ్యవస్థలో మరీ కొట్టొచ్చినట్లు కనిపిస్తున్న లోపాన్ని సవరించడానికి పూనుకొంది. ఆ లోపాన్ని పట్టుకొనేందుకు ఉపసంఘాల నివేదిక లక్కర్లేదు. ఈ సందర్భంలో మేము తీసుకొంటున్న చర్యలను

ఇక్కడ చెప్తాను. ఈ పనిని చెయ్యాలంటే మేము ఎదుర్కో వలసిన చిక్కులు కూడా అర్థం అవుతాయి.

## 1. ప్రభుత్వోద్యోగులు ; ప్రజలు

ప్రభుత్వోద్యోగులకూ ప్రజాసామాన్యానికీ జీవిత పద్ధతులలో, ఆలోచనలలో, కార్యవిధానంలో ఎంతో అంతరం వుంది. అదే పరిపాలనా వ్యవస్థ నిరంకుశమూ, ప్రజా వ్యతిరేకమూ కావడానికి ప్రధాన కారణం. అన్ని స్థాయిలలోనూ కూడ ప్రభుత్వోద్యోగులు తామీ 'మూక' కంటే గొప్పవాళ్ళ మనుకొంటారు. తమదో ప్రత్యేకవర్గంగా భావిస్తారు. వారు తమకంటే ఎక్కువవాళ్ళనీ, గొప్పవాళ్ళనీ ప్రజాసామాన్యం భావిస్తుంది. ప్రజలనుంచి ప్రభుత్వాధికారులు ఈ విధంగా దూరం కావడమూ, వారిమధ్య ద్వేషభావాలు ఏర్పడడమూ మూలంగా పరిపాలనా వ్యవస్థ ప్రజాదరణ పొందలేకుండా వుంది. ఎన్నికలు జరుగుతున్నా, పార్లమెంటరీ విధానపు హంగులన్నీ అమలు జరుగుతున్నా పరిపాలనా వ్యవస్థ మాత్రం ప్రజాతంత్రయుతం కావడంలేదు.

ఈ అడ్డుగోడల్ని బద్దలుకొట్టేటందుకే 26 ఏళ్ళ క్రితం భారతజాతీయ కాంగ్రెసు కరాచీ కార్యక్రమంలో ప్రభుత్వోద్యోగులకు ఎక్కువలో ఎక్కువ 500 రూపాయలకు మించి జీతం వుండరాదని విధించింది. పరిపాలనా వ్యవస్థ నంతనూ పునర్నిర్మించాలని ప్రజా వుద్యమాలన్నీ ఏకభిప్రాయంగా కోరుతున్నదిందుకే. ఈ మార్పువలన ఖర్చు తగ్గడమేగాక ప్రజలకూ, పరిపాలనా వ్యవస్థకూ మధ్య ఐక్యతకుదురు తుందని భావించబడుతూంది. కాని స్వాతంత్ర్యంవచ్చి కాంగ్రెసే

అధికారంలోకి వచ్చేక కాంగ్రెసుచేసిన ఈ ప్రకటనలోని మూల భావలకు తిలాంజలి యిచ్చేసేరు, ప్రజా వుద్యమాలు మొదట వేసుకోన్న కార్యక్రమాన్ని అమలు జరపాలని మా ప్రభుత్వం సంకల్పించిది. మాజీతాలను తగ్గించుకోవాలని మేము నిర్ణయించుకున్న దిందుకే. మంత్రులు సంచారం వెళ్ళినప్పుడు పోలీసు బందోబస్తు లేకుండానూ, ఆర్భాటాలు లేకుండానూ చేయడం దీనికోసమే.

మే మీనిర్ణయాలు తీసుకొన్నప్పుడు అనేక తరహాలుగా మమ్మల్ని విమర్శించేరు.

జీతాలు తగ్గించుకొంటామన్న నిర్ణయం వట్టి బూటకం అన్నారు. తగ్గించుకొన్న జీతాలకు మించి ప్రయాణబత్తాలు లాగుతారన్నారు. కొంతమంది పాత్రికేయులు బహు తెలివిగా లెక్కలు కట్టి కొత్తజీతాల బత్తాల బిల్లులో విధించిన జీతాలూ నిర్ణయించిన బత్తాలూ వెనకటి మంత్రివర్గాలు తీసుకొన్నదాని కన్న ఎక్కువే అవుతాయని తేల్చేరు. కాని, అసలు లెక్కలు ఈ అంచనాలలోని అవకతవకల్ని బయటపడేసేయి. నాలుగు నెలలపాటు కొత్తమంత్రివర్గమూ, వెనుకటి కాంగ్రెసు, ప్ర. సో పార్టీ మంత్రివర్గాలూ తీసుకొన్న జీతబత్తాల మొత్తాల్ని వుదాహరణగా దిగువ నిస్తున్నాను.

మంత్రుల జీతబత్తాలు తగ్గించడంవలన ప్రభుత్వపు వ్యయంలో తగ్గేది విశేషం వుండదనీ, అందుచేత అది అనవసర మనీ కొందరు విమర్శిస్తున్నారు. ఈ నిర్ణయం వట్టి "రాజకీయపు బుకాయింపు" తప్ప వేరుకాదు అన్నారు. అయితే వీరొకటి మరుస్తున్నారు. మంత్రుల జీతబత్తాలు తగ్గించడంవలన ప్రత్యే

| | నంబూద్రిపాద్ [కమ్యూనిస్టు] | పనంపల్లి [కాంగ్రెసు] | తానుపిళ్లై [ప్ర. సో. పార్టీ] |
|---|---|---|---|
| జీతాలు | రు. 1353.13 న. పై | రు. 3509 | రు. 2241.94 పై. |
| కరువుబత్తెం | రు. 251 | రు. 375, | రు. 336,31 పై. |
| ప్రయాణాలకు | రు. 966.67 న. పై. | రు. 1250. | రు. 1196.62 పై. |
| దినసరి | రు. 195 (నెలకు) | 0 | రు. 112. |
| చిల్లర ఖర్చులు | రు. 41.26. న. పై. | రు. 23.81. | రు. 46. |
| స్వంతయింట వుంటూనే శ్రీ పట్టం తానుపిళ్ళె ఇంటి అద్దె పేరుతో వసూలుచేసినది. | — | — | రు. 600. |
| | రు. 2807. 6 | రు. 5157. 81 | రు. 4529. 87 |

కంగా లాభించేదేమీ వుండకపోవచ్చు కాని, ఇది ప్రారంభం మాత్రమే. దీనితర్వాత వుద్యోగు లందరి జీతాలు బాగా తగ్గిస్తేనూ, దాని ఫలితంగా వారి జీవన పద్ధతులలో మార్పులు తెస్తేనూ ప్రభుత్వానికి ఎంతో ఆదా అవుతుంది.

ప్రభుత్వ ఖజానాకు ఆదా చెయ్యడం ఒక్కటే కాదు. ప్రజలకూ, వుద్యోగి వర్గానికీ మధ్యనున్న అడ్డుగోడలు కూలిపోవడం చిన్న విషయంకాదు. ఉద్యోగులలో ప్రత్యేకవర్గం అనుకోవడమూ పోవాలి. దేశ ఆర్థికాభివృద్ధికోసం దేశంలోని అన్ని వర్గాల ప్రజలూ ఎన్నో త్యాగల కొడిగట్టవలసిన సమయం ఇది. ఈ స్థితిలో ఒకవేపున ఉద్యోగవర్గం విపరీతమైన విలాసాలతో జీవితం గడుపుతూంటే రెండోవేపున ప్రజల్ని పొట్ట కట్టుకోమనడం ఉచితం కాదనే సంగతిని ఈ విమర్శకులు మరిచిపోతున్నారు. అధికారవర్గానికీ, ప్రజానీకానికీ మధ్యవున్న అడ్డుగోడల్ని కూలగొట్టడంతోనే ఒకనూతనమైన మానసిక పరివర్తన కలుగుతుంది. "గట్టిగా పనిచెయ్యమ"నీ, దేశంయొక్క ఆర్థికాభివృద్ధికోసం "సర్వం త్యాగం చెయ్యమ"నీ చెప్పే ప్రధాని ఇతర దేశనాయకుల మాటలు కార్యరూపం ధరించే అవకాశం ఏర్పడుతుంది,

మంత్రుల ప్రయాణంలో జరిగే ఆర్భాటాలను తగ్గించే ప్రయత్నం దేశైక్యతకు భంగకరమనీ కేంద్రప్రభుత్వం యెడ అపచారం చెయ్యడమేననీ కొందరు విమర్శిస్తున్నారు. ప్రభుత్వ జెండాయెడ గౌరవం లేకపోవడంచేతనే మంత్రుల కార్లమీద ప్రభుత్వపు జెండా పెట్టే అలవాటును తగ్గించుకోనీయవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరినామట. ఈ మాదిరి కట్టుకథలు శాసన సభలో కూడ వర్ణించేరు. కాని ఈ మార్పును కోరుతున్నది

మేముకాదు. ప్రధానమంత్రీ, కేంద్ర హోంమంత్రీ మంత్రుల సంచార కార్యక్రమాలలో ఆర్భాటాలు తగ్గించేటందుకోసం కార్లమీద జెండా లేకుండా వుండాలని సూచించేరు.

రాష్ట్రంలోనూ, వెలుపలాకూడా ఈ మాదిరి విమర్శలు ఎన్నో వచ్చినా, ఈ చర్యలవెనుక నున్న అభిప్రాయాలను దేశంఅంతా అభినందించింది. అనేక రాష్ట్రాలలో మంత్రులూ, కేంద్రమంత్రులూ వీనిని కొంతవరకైనా అమలు జరప బూను కోవడం సంతోషకరం. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ మంత్రులు తమ జీతాలలో కొంతకొంత భాగాల్ని ఐచ్ఛికంగానే తగ్గించుకొన్నారు. ఇతర భత్తాలు తగ్గించుకొన్నారు. మంత్రుల ప్రయాణాలలో ఆర్భాటాలు తగ్గించుకొన్నారు ఇవన్నీ హర్షించ దగిన విషయాలు.కాని,ఇదేమూలకూ చాలదని మాఅభిప్రాయం. కేంద్రమంత్రుల జీతబత్తాలు ఇంకా బాగా తగ్గించుకోవచ్చు. ఈ పొదుపు కార్యక్రమాన్ని ఒక మంత్రులకే కాదు. పెద్ద వుద్యోగులకు వర్తింపచేయాలి. చాల సమర్థులయిన సాంకేతిక నిపుణులు కొద్దిమంది కెవరికోతప్ప వేయి రూపాయలకు మించి జీతా లెవ్వరికీ వుండరాదని మనప్రభుత్వం సూత్రీకరించింది. కేంద్ర ప్రభుత్వం వుద్యోగులను సమకూర్చుకొనేటందుకు అనుస రిస్తున్న విధానమూ, ప్రభుత్వోద్యోగులకిచ్చే జీతాలూ మొద లయినవి ఇప్పటివలే వుండగా ఈసూత్రం కార్యరూపరింధంచడం సాధ్యంకాదు. మన రాష్ట్రంలో వేయిరూపాయలకు మించి జీతం వుండరాదంటాము. ఇతర రాష్ట్రాలలోనూ, కేంద్రం లోనూ అంతకంటె ఎక్కువ ఇస్తారు. దానితో అనేక అసంద ర్భాలు. కేంద్రమూ, ఇతర రాష్ట్రాలూ కలిసివస్తేతప్ప దీనిని అమలు జరపలేము. జాతీయాభివృద్ధి అవసరాలదృష్ట్యా మేం

అనుసరిస్తున్న విధానం దేశాభివృద్ధికరమేనని కేంద్రమూ ఇతర రాష్ట్రాలూ గుర్తించగలవని విశ్వసిస్తున్నాము.

## 2. సలహాసంఘాలూ - పంచాయతులూ

కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ శాశ్వతోద్యోగులు. ఎన్నుకోబడిన ప్రతినిధుల ఆధీనంలో వుంటున్నారు. పరిపాలనా శాఖలు ఎన్నికయి ఏర్పడిన ప్రభుత్వాలకు సమాధానం చెప్పుకోవాలి. కాని. దిగువస్థాయిలలోని వుద్యోగివర్గం స్వయం రాజా స్వయం మంత్రీ. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరించే సాధారణ విధానాన్ని అమలు జరుపడంలో తమకు సరియైనదని తోచినపద్ధతివారు అనుసరించుకుపోవచ్చు. పరిపాలనాశాఖలో ప్రజాతంత్రం పుట్టి, అక్కడే అంతరించి పోతూందన్నమాట, జిల్లా తాలూకా స్థాయిలలో ప్రజాతంత్రంలేదు. గ్రామపంచాయతీలలోనూ, మునిసిపాలిటీలలోనూ, జిల్లాబోర్డులు మొదలయిన వానలోనూ ఎన్నుకోబడిన ప్రజాతంత్ర వ్యవస్థలున్నాయి. కాని, వానిఅధికారాలు చాలా పరిమితం. పరిపాలనావ్యవస్థలో నిరంకుశధోరణులు రావడానికి కిదో కారణం. అంటే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల స్థాయిలో ప్రధానసమస్యల మీద వాటికేమాత్రం పెత్తనంలేదు. పరిపాలనా వ్యవహారాలలో కలక్టర్లు, ఆర్. డి. ఓ లూ, తాసీల్దార్లూ ఇతర శాఖలలో పెద్ద ఉద్యోగులూసర్వాధికార్లు.

ఈ పరిస్థితుల్ని చక్కబరచేదెట్లా? శాశ్వతోద్యోగులసహాయంతో కొనసాగింప బడుతున్న గ్రామ పరిపాలనాధికారాలన్నింటినీ గ్రామ పంచాయతీల కివ్వవచ్చునా ? తాలూకాబోర్డులకూ, జిల్లా బోర్డులకూ, ఎన్నికలు జరిపించి తాసీల్దార్లూ'

జిల్లా కలక్టర్లూ వానికి జావాబ్దారీగా వుండేటట్లు చేయడమూ, ఈ బోర్డుల్ని రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలకు జావాబ్దారీ వహించేటట్లు చేయడమూ ఎల్లావుంటుంది.? రాష్ట్ర ప్రభుత్వాల స్థాయి నుంచి జిల్లాల, తాలూకాల వరకూ శాశ్వతోద్యోగుల్ని ప్రజానిధుల అధీనంలో వుంచడం మంచిదా ?

ఇవన్నీ విధానానికి సంబంధించిన సమస్యలు. పారిపాలనా సంస్కరణల ఉపసంఘం తప్పకుండా వీటిని పర్యాలోచిస్తుంది. ఈ లోపున వివిధపరిపాలనా విషయాలలో ప్రజాభిప్రాయాన్ని తోడుచేసుకోనే టందుకై సలహాసంఘాల్ని నెలకొల్పాలని ఆలోచిస్తున్నాం. అహారపంపకం విషయంలో అప్పుడే దీనిని ఆచరణలోకి తెచ్చేము. చౌకడిపోలు ఎకడెక్కడ పెట్టాలో నిర్ణయించడంలోనూ గుర్తు కార్డులివ్వవలసిన కుటుంబాల పట్టికలు తయారుచెయ్యడంలోనూ, ఆహార పంపకానికి సంబంధించిన ఇతర విషయాలలోనూ ప్రభుత్వాధి కారులకు సలహా ఇచ్చేటందుకు తాలూకా, పంచాయతీ స్థాయిలలో ఆహార సలహా సంఘాల్ని ఏర్పరిచాము. అభివృద్ధి ప్రణాళికాశాఖలకు, కార్మిక-యజమాని సంబంధాల సమస్యలకుకూడా ఇదేమాదిరిగా సలహా సంఘాల నేర్పరచాలి. రాష్ట్రాభివృద్ధి సంఘాన్నీ, పారిశ్రామిక సంబంధాల సంఘాన్నీ ఏర్పరచడం అల్లాంటిదే.

విద్యా విషయంలోకూడా సలహాసంఘాన్ని నియమించేం. ఈ మధ్యనే శాసనసభ అమోదించిన కేరళ విద్యాబిల్లులో స్థానిక విద్యాసంస్థలను ఏర్పరచడానికి నిబంధనలు చేర్చబడినాయి ఈ స్థానిక విద్యా సంస్థలు విద్యాశాఖ చేయవలసిన వివిధ పనులను నిర్వర్తించడంలో తోడ్పడుతాయి.

ఈ సలహాసంఘాల నియామక పద్ధతులలో చాలా పరిమితులున్నాయి. లోపాలూ వున్నాయి. వానికి మూలమల్లా అవి ప్రజలెన్నుకొన్నవి కాకపోవడమే. వానిని వుద్యోగులే నియమిస్తారు. శాశ్వతోద్యోగులకు సలహాలివ్వడం వరకే వాని పని. పైనుంచి దిగువకంటా ఎన్నుకోబడిన సంస్థలుపర్చడి ప్రజాతంత్రం పూర్తిగావినియోగంలోకి వస్తే వుండే పరిస్థితికివి ఈడు కావు. అయినా పరిపాలనా వ్యవస్థను ప్రజాతంత్ర యుతంగా మార్చే ప్రయత్నంలో ఇదొక ప్రధానమైన ముందడుగే అనాలి. ఏమంటే కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ శాసననిర్మాణం ప్రజాప్రతినిధుల చేతులలో ఇదివరకేవుంది. ఇప్పుడు దిగువనకార్య నిర్వహణ విధులలోకూడా ప్రజల ప్రమేయం వుండేటట్లు చేస్తుంది.

దీనిని కాంగ్రెసు ప్రజాసోషలిస్టుపార్టీ ముస్లింలీగు వ్యతిరేకించడం ఆశ్చర్యకరం. ఇవి ఒకపార్టీ పరిపాలన బలబడడానికి తోడ్పడతాయట. శాసనసభలోనూ, బయటా ప్రతిపక్షనాయకులిచ్చిన వుపన్యాసాల ప్రకారం కలక్టర్లు, ఇతరశాశ్వతోద్యోగులూ నిజమైన ప్రజాతంత్రానికి ప్రతినిధులు. రాష్ట్ర ప్రభుత్వాలూ, కేంద్రమూ పరోక్షంగా వారి చర్యలను అదుపు చెయ్యవలసిందే తప్ప వారి పనులమీద నిఘా వుంచరాదట. శాశ్వతోద్యోగులకు సలహాలిస్తుండడానికీ, వారి పనులలో తోడ్పడడానికీ అన్ని పార్టీలవారితో కూడిన సలహాసంఘాలను నియమించడం ప్రజాతంత్ర యొక్క పురోగతిని భగ్నపరచడమేనట.

ఈ సలహా సంఘాలన్నింటినీ కమ్యూనిస్టులతో నింపేసేరన్నది వీనికి వ్యతిరేకంగా తెస్తున్న వాదనలలో ఒకటి. ఈ

విమర్శకు చాలూమూలంలేదు. ఈ సంఘాలలో అన్ని విధా లయిన దృక్పథాలు కలవారిని చేర్చేటందుకు శ్రద్ధతీసు కొన్నాము. గత ప్రభుత్వాలు ఎప్పుడన్నా ఇట్లాంటి సంఘా లను నియమించినప్పుడు వానిలో కమ్యూనిస్టులుండకుండా చేసేవారు. ఇప్పుడది జరగలేదు. ఇతర పార్టీలలాగనే కమ్యూ నిస్టుపార్టీకికూడా ఈ సంఘాలలో సముచితమైన స్థానం ఇవ్వ బడింది. దీనికి ఆటంకం చెప్పడానికివీలులేదు. న్యాయమూ కాదు. ఆమాట చెప్పలేక వీనిని కమ్యూనిస్టులతో నింపేసేరని అభాం డాలు వేస్తున్నారు. వాటికేమాత్రం అధారంలేదు.

### 3. ప్రజాపీడకులుగాకాక ప్రజాసేవకులుగా పోలీసులపాత్ర

పోలీసు బలగం యథాపూర్వకంగా వుండిపోయినంత కాలమూ పరిపాలనా వ్యవస్థలో ఎన్ని మార్పులు తెచ్చినా ఒకటే. అది ప్రజాతంత్రయుతం కాజాలదు. పోలీసులన్నా, పోలీసు వుద్యోగులన్నా ప్రజలకు హడలు. సంఘ వ్యతిరేక చర్యలను అణిచెయ్యడం పేరుతో వారు ప్రజాపీడకులయ్యేరు. ఏదన్నా దొంగతనమో, చిన్న నేరమో జరిగిందంటే ఆ ప్రాంతం లోని వాళ్ళందరినీ - నేరస్తుల్ని అమాయకుల్నికూడా - వాళ్ళు భయంకరంగా బాధిస్తారు. ఆడ, మగ, పెద్ద పిన్న అనకుండా అందరినీ హడలుకొట్టితేనే శాంతిభద్రతలుంటాయని పోలీసుల అభిప్రాయం. శాంతి భద్రతలను రక్షించే పనేగాక ప్రజాతంత్ర రాజకీయపార్టీలనూ, ప్రజాసంస్థలనూ అణిచెయ్యడంకూడా వీరి కార్యక్రమాలలో ఒక భాగం. ప్రెస్ ఆక్టు, ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 107, 144 సెక్షన్లు మొద లయినవాని సహాయంతో అరెస్టులు చేస్తారు. జైళ్ళలో పడే

స్తారు. లాఠీచార్జిచేస్తారు, కాల్పులుసాగిస్తారు. ఇవన్నీ పోలీసులకు నిత్యకృత్యం అయిపోయింది.

పరిపాలనా వ్యవస్థ నిజంగా ప్రజాతంత్రయుతం కావాలంటే ఈ పరిస్థితి మారాలి. అందుకే పోలీసుల పద్ధతులలో మార్పుతీసుకురావడం ప్రథమ కర్తవ్యంగా మా ప్రభుత్వం భావించింది. 1957 జూలై 23 న పత్రికా విలేఖరుల సభలో ఈ విషయమై మేము అవలంబించదలచిన పద్ధతిని గురించి ఒక ప్రకటన చేసేను. దానిలో ఇల్లా వివరించేను.

"1. గతంలో పోలీసుల బాధ్యతలు రెండు తరహాలుగా వుండేవని అందరూ ఎరుగుదురు. ఒకటి: నేరస్థుల్ని పట్టుకోవడం, సంఘ వ్యతిరేకశక్తులను పట్టుకోవడం, రెండోది: దేశంలో ప్రజా వుద్యమాల అభివృద్ధిని నిరోధించడం. కొన్ని రాజకీయపార్టీలను పూర్తిగా అణచివేయకపోయినా వారి కలాపాలను నిరోధించడం, "స్వాతంత్ర్య సాధనకు పూర్వం కాంగ్రెసుతోసహా స్వాతంత్ర్యం కోరిన రాజకీయ పార్టీలన్నీ పోలీసు ఒత్తిడికి గురి అయ్యేయి.మాస్వాతంత్ర్యం వచ్చేక వామపక్షాల మీద ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ మీదా వారి మిత్రుల మీదాపోలీసు నిగరానీ సాగింది. అధికారంలోవున్నది ఏ పార్టీయే కానీండి పోలీసులు ఈ విధంగా వ్యవహరించడం తమకిష్టం కాదని ప్రజానీకం గడచిన రెండేళ్ళలోనూ, ముఖ్యంగా మొన్న జరిగిన జనరల్ ఎన్నికలలో స్పష్టంచేసింది. వాక్సభాపత్రికా స్వాతంత్రాలు

ప్రజాతంత్రానికి ప్రాణంలాంటివి, వాటికి మనరాజ్యాంగం హామీ యిస్తూందికూడా. దేశంలోని ప్రతి రాజకీయ పార్టీకీ ఆ స్వాతంత్ర్యాల ననుభవించే హక్కువుంది. పోలీసులు శాంతి భద్రతలు కాపాడే పేరుతో రాజకీయ పార్టీల కున్న ఈ హక్కులమీద దాడిచేయడానికి మా ప్రభుత్వం అంగీకరించదు. ప్రజాతంత్ర వ్యవస్థకు మూలకందమైన ఈ విధానానికి విరుద్ధంగా వుండే పద్ధతులను మార్చి వేయాలి.

"2. రాజకీయపార్టీల సమస్య ఒక్కటేకాదు. కార్మికుల సమ్మెలు, రైతుపోరాటాలు, విద్యార్థుల ఆందోళనలు, ఇతర ప్రజావుద్యమాలు వున్నాయి. వాని విషయంలో ఎల్లా వ్యవహరించాలనేది కూడా ఒక సమస్యే. కార్మికుల లోనూ, రైతుల లోనూ ఏమాత్రం అసంతృప్తి కనిపించినా, ప్రదర్శనలు, సమ్మెలు, హర్తాళ్ళు, సత్యాగ్రహాలు ఏంజరిగినా గత ప్రభుత్వాలు యజమానులకూ, భూస్వాములకూ సహాయంగా పోలీసుల నురికించే వారు. వారి వుద్యమాల నణచెయ్యడానికై నిషేధాజ్ఞలు ప్రకటించే వారు, కేసులు పెట్టేవారు, లాఠీచార్జీలూ, కాల్పులూ సాగించేవారు. "ప్రజా వుద్యమాల నణచడానికై పోలీసుల నుపయోగించే అలవాటు ఎంత ఎక్కువై పోయిందంటే వారిని వుపయోగించడం శాసనబద్ధ పాలనలో ఒక భాగంగా భావింపబడే పరిస్థితి ఏర్పడింది. శాసనబద్ధ పరిపాలన సాగుతున్న దేశాలలో అగ్రగణ్యంగా పేర్కొనబడే ఇంగ్లండులో పోలీసుల్ని

ప్రజా వుద్యమాల నణచడంకోసం వుపయోగించరు. కొన్ని దశాబ్దాల ఈ మధ్యన సమ్మెదారుల మీద తుపాకులు కాల్చిన వుదంతాలు గాని, సమ్మెలలోనూ, ఇతర ప్రజా వుద్యమాలలోనూ పాల్గొన్నందుకు ఎవరి మీదనా కేసులు పెట్టిన వార్తలుగాని, నిషేధాజ్ఞలు ప్రకటించిన వృత్తాంతంగాని మనం వినలేదు. ఆసమ్మెలూ వుద్యమాలూ దేశవ్యాపితం అయినా సరే, ఒక పరిశ్రమ నంతనూ స్తంభింపచేసినాసరే, కాని మనదేశంలో ఒక చిన్న తోటలోనో, ఫాక్టరీలోనో చిన్నసమ్మె జరిగినా పోలీసులు కలుగచేసుకోవడం, నిషేధాలు, నిర్బంధాలు, కేసులు, కాల్పులు పరిపాటి అయిపోయి నాయి. ఇంతవరకు యజమానులకు భూస్వామందులకు కార్మికులను రైతులను అణచివేసేటందుకు లభిస్తున్న పోలీసు సహాయం ఇకముందు ఇవ్వకపోవడం న్యాయ శాసన విరుద్ధమనే వాదనలను మా ప్రభుత్వం ఖాతరు చేయదు. ఆ విధంగా కలవాళ్ళకు పోలీసు మద్దతు నివ్వడమంటే లేనివాళ్ళ ప్రాథమిక హక్కులను-సమిష్టిగా బేరం ఆడేహక్కు సమ్మెలకుగాని, అల్లాంటి శాంతియుత ప్రత్యక్ష కార్యాచరణకుగాని దిగేహక్కు మొదలయినవి - భంగపరచడ మేనని మా ప్రభుత్వం భావిస్తుంది.

"3. ప్రజావిరుద్ధ చర్యల కుపయోగించడం మానితే పోలీసులలో "నిరుత్సాహం" ఎందుకు వ్యాపించాలో మాకు అర్థంకాదు. కాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీమన్నానారాయణ గారితో సహా చాలమంది

కాంగ్రెసువారూ ఇతర ప్రతిపక్షాలవారూ ఈ వాదన తేవడం ఆశ్చర్యకరంగా వుంది. ప్రజలకు విరుద్ధంగా పోలీసుల నుపయోగించరాదని మా అభిప్రాయం. అంటే, హత్యలు దోపిళ్ళు, గృహదహనాలు మొదలయిన సంఘ వ్యతిరేక చర్యలను అణచివేయడంలో పోలీసుల సామర్థ్యాన్ని ఉపయోగాన్ని కుంటుపరచడం మా వుద్దేశం కాదు. ఈ సమస్యలలో వారింకా సమర్ధవంతంగా పని చెయ్యాడమే మా అభిమతం. ఈ విషయమై వారు సమర్ధంగా పనిచేసేందుకూ దానికితగిన ప్రోత్సాహం ఇచ్చేటందుకూ మాప్రభుత్వం శక్తివంచన లేకుండా పనిచేస్తుంది.

"4. ప్రజా వుద్యమాలను అణడానికై పోలీసులనుపయోగించ బోమంటే భారతపౌరులుగా ఆస్తిపరులకు న్యాయంగా లభించవలసిన రక్షణలేకుండా చేస్తామని అర్థంకాదు. శ్రామికవర్గాల ప్రత్యక్ష కార్యాచరణకు కొన్ని పరిమితులున్నాయని మేము ఎరుగుదుం. ప్రత్యక్ష కార్యాచరణవలన ఆస్తిపరుల ఆస్తులకుగాని, వ్యక్తులకు గాని నష్టం కలగరాదు. కొన్ని సందర్భాలలో ప్రత్యక్షాచరణ ఈ పరిమితులను దాటిందని ప్రభుత్వానికి తెలియవచ్చింది. ఒక ఫ్యాక్టరీవద్దనో, తోటలోనో ప్రారంభమయిన సత్యాగ్రహమూ, సమ్మె ఒక్కొక్క సందర్భంలో యజమానుల ఇళ్ళను చుట్టిముట్టి కుటుంబ సభ్యులను బయటకు రానీకపోవడందాకా వచ్చిందని మాకు తెలిసింది. ఈమాదిరి పనులు శాంతియుత ప్రత్యక్ష కార్యాచరణ పరిధులలోకి రావు. అటువంటి

పరిస్థితులు రానీయవద్దనీ, శాంతంగా ఎవరి పనులు వారు చేసుకుపోవడానికి అభ్యంతరం కలగనీయవలదనీ ప్రభుత్వం కార్మిక సంస్థలకూ. ప్రజాతంత్రవాదులకూ విజ్ఞప్తి చేస్తూంది కార్మిక సంస్థలూ, వ్యక్తులూ చేస్తున్న ప్రయత్నాలు విఫలమై ప్రత్యక్ష కార్యాచరణ పైన చెప్పిన పరిధుల్ని దాటి కొనసాగించబడుతూంటే పోలీసులు కలుగచేసుకోవలసి వస్తుంది. కలగచేసుకోనిస్తాము కూడా."

ఈ ప్రకటన ప్రతిపక్షాల వారిలోనూ, ఆస్తిపరులలోనూ చాల అలజడి కలిగించింది. నేరగాళ్ళను పట్టుకోడానిక్కూడా పోలీసుల నుపయోగించరని వారు అర్థంతీసేరు. ప్రజలను బాధించడానికి వుపయోగించక పోయినంత మాత్రంచేత నేరస్థుల్ని పట్టుకోగల శక్తి కొరవడ వలసిన అవసరం లేదన్నా వారు వినిపించుకోలేదు. "పోలీసుల శక్తి నీళ్ళు కారిపోతూంది." అనీ, వారు "నిరుపయోగం అయిపోతున్నార"నీ గోల ప్రారంభించేరు. "శాంతి భద్రతలకు ప్రమాదం వాటిల్లింద"నీ; "వ్యక్తులకూ ఆస్తులకూ రక్షణ లేదనీ" గోల పెట్టడానికిదేమూలం. భద్రత లేదనే అరుపులను సమర్థించుకునేటందుకు ఎక్కడో జరిగిన ఒకటీ అరా చిన్న చిన్న ఘటనలను ఉదాహరిస్తున్నారు. వారు చెప్తున్న మాదిరి ఘటనలు గత ప్రభుత్వాల కాలంలో జరిగాయి. ఇప్పు డితర రాష్ట్రాలలో జరుగుతున్నాయి.

ఇక్కడొక విషయం చెప్తాను. శాంతి భద్రతలకు ఏమీ లోపం లేదని నేను చెప్పడంలేదు. ప్రజలతోటి వ్యవహారాలలో పోలీసులు ప్రవర్తించవలసిన విధానాలను ప్రభుత్వం మార్చాలని

ప్రయత్నించేటప్పుడు సంఘవ్యతిరేక శక్తులు ఆ అవకాశాన్ని తీసుకొని తమ దుష్కృత్యాలను సాగించాలని ప్రయత్నిస్తారు. ఈ పరిస్థితులలో సర్వత్రా కాకపోయినా కొన్నిచోట్లనైనా దొంగతనాలూ మొదలయినవి పెచ్చుపెరిగి వుండొచ్చు. అల్లాంటిదేమన్నా జరుగుతున్నదేమో జాగ్రత్తగా పరిశీలించి, వాటిని జరగకుండా చేయడం ప్రభుత్వ కర్తవ్యం. ఆ పని చెయ్యడానికి మేము బద్ధకంకణులమై వున్నాము. ఈ విషయంలో స్త్రీ పురుషులంతా సద్భావం చూపించి సాయపడితే ఆ పనిని విజయవంతంగా చేస్తాము. ఈ పని అంత సులభం కాదని మాకు తెలుసు. ఇక్కడ పోలీసుశాఖ దృక్పథాన్నే కాదు, యావన్మంది ప్రజల దృక్పథాన్ని మార్చవలసివుంది. పోలీసులు ఇంక ప్రజాపీడకులుగా గాక ప్రజా సేవకులుగా పని చేస్తారనే భావాన్ని పోలీసులలోనే కాదు, ప్రజలందరిలోనూ కూడ కలిగించాలి. పోలీసులు తమ దినసరి వ్యవహారాలలో ఈ సూత్రాన్నే పాటించి నడుచుకొనేటందుకు నిర్మాణాత్మకమైన, పరిపాలనా విషయిక హామీలను కలిగించాలి.

## 4. సాంఘిక సంస్కరణలకూ సాంస్కృతికాభివృద్ధికీ ప్రభుత్వం తోడ్పాటు

సాంఘికవ్యవస్థలో తీసుకురావలసిన సంస్కరణలకు పరిపాలనా సంస్కరణలంత ప్రాముఖ్యత వుంది. మన సమాజం అసంఖ్యాకమైన కులాలుగా విభజించబడడం వలన సాంఘిక విషయాలలోనే గాక రాజకీయ విషయాలలో కూడ అనేక అసందర్భ స్థితులు వచ్చేయి.

ఒక ఉదాహరణ చెప్తాను : మన రాష్ట్ర రాజకీయాలలో ఉద్యోగ నియామకానికి చాల ప్రాముఖ్యత వుంది. అనుసరించే ఆర్థికవిధానాలూ మొదలయిన వానికన్న ఎవరిని ఏ వుద్యోగంలో నియమించారో, ఎవరిని ఏ వుద్యోగంనుంచి దేనికి ప్రమోట్ చేసేరో, సీనియారిటీ లిస్టులలో స్థానా లెవరికి ఎల్లా ఇచ్చేరో - అనేవాటికి ఎనలేని ప్రాముఖ్యత. దీనికితోడు ఏ వుద్యోగంలో ఏ కులంవారిని వెయ్యాలనే సమస్య ఒకటి, కులాల, మతాల ప్రాతిపదికమీద అభ్యర్థిని బలపరచే జనం బయలుదేరుతారు. మన రాజకీయసంస్థలలో చాలామట్టుకు మొదట ఈ విధంగా బయలుదేరినవే. క్రమంగా అవి పెద్ద రాజకీయ సంస్థలలో కులమత ముఠాలుగా అంతర్గర్భితం అయి జాతీయరూపాలు ధరించేయి.

ఈ విషయంలో. కేరళ ప్రత్యేక స్థితికి ఒక్క నిదర్శనం చూపించవచ్చును. బంట్రోతులవరకూ అన్ని వుద్యోగాలలోనూ అభ్యర్థుల్ని నియమించే బాధ్యత పబ్లిక్ సర్వీసు కమీషనుకే వప్ప చెప్పేరిక్కడ. ఇటువంటి స్థితి మరేరాష్ట్రంలోనూ లేదు. మంచి అధికారమూ, హోదావున్న ఏవోకొద్ది పెద్ద వుద్యోగాలకు మాత్రమే ఇతర రాష్ట్రాలలో పబ్లిక్ సర్వీస్ కమిషనుద్వారా నియమిస్తారు. కాని, ఇక్కడ సర్వీస్ కమిషన్ నియమించే వుద్యోగాల పరిమితిని వీలయినంతగా విస్తరింప చేయాలని ప్రజలలో అన్ని తరగతులవారూ కోరుతున్నారు. ప్రభుత్వోద్యోగాలు అన్ని కులాలవారికి న్యాయంగా దొరకాలంటే ఇదొక్కటే మార్గమని వారి అభిప్రాయం.

ప్రస్తుతంవున్న పరిస్థితులలో అర్హతలను పట్టే వుద్యోగాలు ఇవ్వడానికి పూనుకొంటే ప్రభుత్వోద్యోగాలు కొద్ది కులాలకు

మాత్రమే పరిమిత మైపోతాయనే సంగతి తథ్యం. మనదేశ చారిత్రక పరిణామంలో కొన్ని కులాలవారు సమర్థులుగా వుండడానికీ, దిగువ కులాలవారు వెనకబడి వుండడానికీ తగు పరిస్థితులు మనదేశంలో ఏర్పడ్డాయి, అందుచేత కొంతకాలంవరకూ ఉద్యోగాలను కులాలవారీగా పంచడం అనేది తప్పనిసరి. కులాల నిష్పత్తిపై వుద్యోగాలకు నియమించే అధికారం పబ్లిక్ సర్వీస్ కమిషనుకు ఇవ్వాలని మిగిలిన పార్టీలు చెప్పే అభిప్రాయాన్ని మేమూ బలపరుస్తున్నాము.

ప్రస్తుత పరిస్థితులలో గుడ్డిలో మెల్లగా ఈ విధానానికి అంగీకారం తెలుపుతున్నా, సమాజం కులాలవారీగా విభజించబడడం వలన కలుగుతున్న అపకారాలను సాధ్యమైనంత త్వరలో నిర్మూలించేటందుకై ప్రభుత్వమూ, ప్రజలూ కలిసి పని చెయ్యాలి. ఇది చాల కష్టమైన పనే. కొన్నివందల సంవత్సరాల అలవాట్లు తొలగించాలి. దైనందిన అలవాట్లూ సాంఘికాచారాలూ పూర్తిగా మారాలి. కులపిశాచంమీద అన్నివేపుల నుంచీ దెబ్బతీస్తేనే ఇదిసాధ్యం. ఈ మహత్కార్యాన్ని సాధించేటందుకై అన్ని సంస్థలూ, అభివృద్ధి కాముకులూ కలిసి పని చెయ్యాలి. నూతన సాంఘిక చైతన్యాన్ని కలిగించడంలోనూ, పాత సాంఘిక అవశేషాల్ని నిర్మూలించడంలోనూ సంస్థలకూ, అభివృద్ధి కాముకులకూ ప్రభుత్వం సాయంచేస్తుంది. అంతవరకే సాధ్యం

ప్రత్యేక సౌకర్యాలు కావాలనీ, రక్షణ లివ్వాలనీ కోరుతూ అటువంటివారితో తమరినికూడా చేర్చవలసిందని అనేక కులాలవారూ, మతాలవారూ నిత్యం దరఖాస్తులు పెడుతు

న్నారు. వాటికి తల ఒగ్గకపోవడం ప్రభుత్వం చేయగల పనులలో ఒకటి. కేంద్ర ప్రభుత్వమూ, రాష్ట్ర ప్రభుత్వాలూ వెడ్యూల్డు తరగతులకు, షెడ్యూల్డు తెగలకు, వెనుకబడిన జాతులకు కొన్ని సౌకర్యాలను కలిగించడంతో వివిధ వర్ణాలవారు తాము వెనక బడ్డవారమేననీ, తమనీ షెడ్యూల్డు తరగతులలో జతపరచవల సిందనీ అడగడం ఎక్కువయింది. ఏమాత్రమూ వెనుకబడి వుండ నివీ, వెనుకబాటుతనాన్ని పోదుల్చుకుంటున్నవీ కొన్నికులాలు తమకంటె అభివృద్ధి పొందినకులాలున్నాయంటూచూపి తామూ వెనుకబడ్డవారమే నంటున్నారు. ఈ ధోరణివలన సమాజంలో వర్ణ విభజన అంతరించడానికి బదులు శాశ్వతం అవుతుంది. అందు చేత ప్రభుత్వం అంతకంతకు ఎక్కువ వుద్యోగాలను అర్హతలను పట్టి ఇచ్చేటందుకు పూనుకోవాలి. కమ్యూనల్ నిష్పత్తి ప్రకారం ఇచ్చేవానిసంఖ్య క్రమంగా తగ్గించాలి.

ఉద్యోగాలలో వివిధ కులాలవారికి న్యాయం కలిగించే సమస్యతోపాటు వివిధ మతాలవారయెడ ప్రభుత్వ దృక్పథం ఎల్లావుండాలనే సమస్యకూడా ఒకటివుంది. వివిధ కులాలకు న్యాయం కలిగించే సమస్యకూ దీనికీ సంబంధంలేదు. కులాలకు న్యాయం కలిగించడం సమస్యసమాజం వివిధ వర్ణాలుగా విభజింప బడడంవలన వచ్చింది. ఈ వర్ణవ్యవస్థను సాధ్యమైనంత త్వరలో రద్దుపరచాలనే భావాన్ని అభివృద్ధి కాముకులెవరూ వ్యతిరేకిం చరు. వర్ణవ్యవస్థపోయి,వర్ణాలమధ్య హెచ్చుతగ్గులు పోగానే వివిధ వర్ణాలమధ్య ఉద్యోగాలను న్యాయంగా పంచాలనే అభ్యర్థన కూడా పోతుంది. అయితే మతాల విషయంవేరు. వర్ణ భేధం పోయినా మతాలూ, మతభేడాలు పోవు. అభివృద్ధి కాముకులు

సంస్థలూ తాము నిరీశ్వరవాదాన్ని ప్రతిపాదించే వారైనాసరే ప్రజలు తమకు తోచిన మతాన్ని స్వీకరించి, అనుసరించడానికి హక్కు వుండాలని కోరుతారు. అందుచేత ప్రభుత్వమూ, అనధికార సంస్థలూ వర్ణవిభజన రద్దుకోసం ప్రయత్నిస్తున్నా వివిధ మతాలవారి విషయమై సహనమూ, సానుభూతీ చూపాలి. వారి వారి మత ప్రచారానికి అన్ని విధాలా సహకరించాలి.

మతప్రసక్తిలేని రాజ్యాంగం అంటే ఇది ప్రతి పౌరుడూ తన కిచ్ఛవచ్చిన మతాన్ని అనుసరించవచ్చు. ఏమతాన్నీ అంగీకరించక పోవనూవచ్చును. ఇటువంటి రాజ్యాంగాన్ని నెలకొల్పడానికి సర్వవిధాల ప్రయత్నించాలని మా ప్రభుత్వ సంకల్పం. కమ్యూనిస్టులు అధికారంలోకి వస్తే మతాలను మననివ్వరన్న దుష్ప్రచారాన్ని నేడు కేరళలో ఎవ్వరూ నమ్మరు. ప్రజల మత విశ్వాసాలను కించపరచే పనులు వేసినీ కమ్యూనిస్టు ప్రభుత్వం చెయ్యలేదు. గత ప్రభుత్వాలు అటువంటి పనులు చేసివుంటే వానిని సరిదిద్దిందికూడా. గతంలో మలబారులోని ముస్లిములు ఏమ మశీదులను మరమ్మతు చేయిందుకోవాలన్నా ఎన్నో చిక్కుల నెదుర్కోవలసివచ్చేది. ఆ చిక్కులను మా ప్రభుత్వం తొలగించింది. ఏమతంవారికైనాసరే తమ మతాగారాల అనుష్ఠానలలో ఇబ్బందులుంటే తీరుస్తామని ప్రభుత్వం హామీ యిచ్చింది. ఈ సంగతులను ప్రజలంతా గమనిస్తూనే వున్నారు.

మత స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వం అంగీకరించడంతో చాలదు. ప్రభుత్వాలయెడ మతాలవలంబించే ధోరణికూడా గమనించవలసి వుంటుంది. ఇది మన రాష్ట్రంలో చాల ప్రధానమైన రాజకీయసమస్య. ఇక్కడ రెండు ప్రధానమైన మతా

లున్నాయి. రెండూ తమ తమ ప్రాబల్యంతో రాష్ట్ర రాజకీయాల్ని గుప్పిట పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నాయి. కాథలిక్ పెత్తందార్లనుగురించీ, ముస్లింలీగ్‌ను గురించే నేను చెప్తూంట. దీని అర్థం కాథలిక్కులుకాని క్రైస్తవులూ హిందువులూ మడి కట్టుకు కూర్చున్నారనికాదు. వారూ యథాశక్తి ఈ ప్రయత్నాలు సాగిస్తూనే వున్నారు. అయినా కాథలిక్ పెత్తందార్లకీ, ముస్లింలీగ్‌వారికీ వారు ఏ విధంగానూ దీటుగారు. ప్రతి ఆర్థిక సమస్యనూ, ప్రతి రాజకీయ విధానాన్నీ ఈ యిద్దరూ తప్పకుండా మతంతో ముడిపెడుతున్నారు. మతంపేరుతో తమ అనుచరులను ఏ అభ్యర్థికి వోటుచెయ్యాలో ఆజ్ఞలూ, విజ్ఞప్తుల ద్వారా ఆదేశిస్తారు. ఆర్థిక రాజకీయ విషయాలమీద ఆందోళనకు చర్చిలను, మశీదులనూ వుపయోగిస్తున్నారు. మత ప్రబోధకులు తమ అనుచరులను వెంటవేసుకొని పోలింగ్ స్టేషన్లకూ, రాజకీయ ప్రదర్శనలకూ, బయలుదేరుతుంటారు.

విద్యా బిల్లుకు వ్యతిరేకంగా కాథలిక్కులు ఈ మధ్య సాగించిన ప్రచారం గమనిస్తే ఈ ముఠాలు మతాన్నీ రాజకీయాల్నీ ఏవిధంగా మిలావ్ చేస్తున్నారో అర్థం అవుతుంది. ఒక దశలో కాథలిక్కులు కాని క్రైస్తవులూ, హిందువులూకూడ యీ బిల్లును వ్యతిరేకించారు. నిజమే దానికి కారణం వేరు. కమ్యూనిస్టు ప్రభుత్వంమీద దెబ్బతీయడానికి విద్యా బిల్లుయెడ గల వ్యతిరేకతను వుపయోగించుకోవాలని కాంగ్రెసూ, ఇతర ప్రతిపక్షపార్టీలూ ప్రయత్నించడంచేత ఆ పరిస్థితి ఏర్పడింది. కాని బిల్లును ప్రధానంగా వ్యతిరేకించినది కాథలిక్కులూ, ముస్లింలీగున్నూ, అందులోనూ ముఖ్యంగా కాథలికుమతస్థులు.

విద్యాబిల్లు చర్చి అధికారాన్ని దెబ్బతీస్తుందంటూ కాథలిక్ మత బోధకులు బుద్ధిపూర్వకంగా సాగించిన దుష్ప్రచారాన్ని నమ్మి కాథలిక్కులు ఈ విధంగా వ్యతిరేకించారు. అసలు విషయాలు దాచిపుచ్చారు, పచ్చి అబద్ధాలు ప్రచారం చేసేరు. ఈ బిల్లు ఆమోదింపబడితే స్కూళ్ళలో మతబోధ సాగనివ్వరనీ, కమ్యూనిస్టు సిద్ధాంతాలు ప్రచారంలో పెడతారనీ కాథలిక్ ప్రచారకులూ వారి రాజకీయ ప్రతినిధులూ ప్రచారం చేసేరు. (పండిట్ నెహ్రూవంటి ప్రజాతంత్రవాది నాయకత్వాన నడుస్తున్న జాతీయసంస్థ కాంగ్రెసుకు చెందిన నాయకులుకూడా ఈమాదిరి ప్రచారానికే తోడ్పడడం సిగ్గుచేటు) ఈ పెద్దలే ఒకప్పుడు స్పానిష్ ప్రజాతంత్ర ప్రభుత్వంమీద జనరల్ ఫ్రాంకో సాగించిన అత్యాచారాలను మతంపేరుతో సమర్దించి బలపరిచారు. (ఆ రోజులలో పండిట్ నెహ్రూ ఫ్రాంకోనిగాక స్పెయిన్‌లోని ప్రజా ప్రభుత్వాన్ని సమర్థించారు. అదేసమయంలో వీరు ఫ్రాంకోను సమర్థిస్తూ తమ అనుచరవర్గాన్ని సమీకరించేరు) ఈనాడు ప్రభుత్వ పాఠశాలలో పనిచేసే వుపాధ్యాయునికున్న సౌకర్యాలనే ప్రైవేట్ పాఠశాలలోని వుపాధ్యాయులకుకూడా కలిగిస్తూ ప్రభుత్వం ఒక సాధారణమైన బిల్లును తీసుకువస్తూంటే అది తమ చర్చికి నష్టం కలిగిస్తున్నదని ఆందోళన ప్రారంభించినది ఈ పెద్దమనుష్యులే. కమ్యూనిజం దాడినుంచి చర్చిని కాపాడడం పేరుతో వారు రాష్ట్రంలోని కాథలికు ప్రజానీకాన్నంతనూ సమీకరించ ప్రయత్నించారు.

ఇక్కడ ఒక ప్రశ్నవస్తుంది. మత ప్రసక్తిలేని రాజ్యాంగంలో ఇల్లాంటి వ్యవహారాలను సాగనీయవచ్చునా? మతప్రసక్తి

లేని రాజ్యాంగం అంటే ఎల్లా వుంటుందో కేరళ ప్రజలు ఎరుగుదురు. తిరువాంకూరు కొచిన్ భాగాలపరిపాలనలో మతప్రసక్తి లేకుండా అయి పదేళ్లయింది. ఆ మహారాజులిద్దరూ రాజ్యాధిపతులూ, పీఠాధిపతులూ కూడయీ పదేళ్ళకు పూర్వం ఎన్నో అభివృద్ధికరములయిన మార్పులుతీసుకొచ్చినా ఆమహారాజుల పరిపాలన హిందూ పక్షపాతంతో, అందులోనూ ముఖ్యంగా అగ్రజాతులయెడ పక్షపాతంతో సాగింది. ఆ పరిస్థితులు - నేడు కనీసం మాటవరసకైనా లేవు, దేవస్వాములను ప్రభుత్వాధికారంనుంచి తొలగించాలనే షరతుమీదనే తిరువాంకూరు, కొచిన్ సంస్థానాలు భారతయూనియన్‌లో భాగంగా తిరువాంకూరు కొచిన్ రాష్ట్రంగా ఏర్పరచబడ్డాయి. ఆనాటివరకూ దేవస్థానం శాఖ ప్రభుత్వంలో ఒక భాగంగా, ప్రభుత్వశాఖలలో ఒకటిగా వుండేది. మతాన్నీ ప్రభుత్వాన్నీ పూర్తిగా విడదియ్యాలనీ, ఒకదానియెడ వేరొకటి తాటస్థ్యం వహించాలనీ ఈ చర్యలో వుద్దేశం. ఆ అభిప్రాయాన్ని మరోమతంవారు మంటగలుపుతూంటె చూస్తూ వూరుకోవలసిందేనా ? ప్రజాతంత్రవాదులంతా ఆలోచించవలసిన సమస్య ఇది,

మత సమస్యనూ, మతం రాజ్యాంగ వ్యవహారాలలో కలుగచేసుకో వచ్చునా అన్న సమస్యనూ వదిలేస్తే కేరళ విద్యాబిల్లు అతి సాధారణమైనదీ, ప్రస్తుత పరిస్థితులకు అనుగుణమైనదీను. మొదట్లో ఇంగ్లీషువాళ్ళు మనదేశంలో అడుగు పెట్టినప్పటినుంచీ ఒకరకమైన విద్యావిధానాన్ని ప్రవేశపెట్టేరు. 'ప్రైవేటు స్కూళ్ళ మేనేజర్లకు ప్రభుత్వ సహాయం' ఇవ్వడం అనే పద్ధతిని వారు ప్రవేశ పెట్టేరు. వారికి విద్యాభివృద్ధి జరగ

దేమోనన్న విచారంలేదు. వారికి కావలసింది వలస ప్రజల్ని పిండడం తమక్రింద గుమాస్తాలుగానూ, చిన్న వుద్యోగులుగానూ పని చేసేటందుకు మనుష్యులు కావాలి. ఆధునిక విజ్ఞాన శాస్త్రాలతో మన ప్రజానీకం పరిచయం పెట్టుకోవడం వాళ్ళ అభిమతంకాదు. చదువుకొని ప్రపంచం తెలిసినవాళ్ళ కన్న అజ్ఞానులూ, మూఢులూ, అయిన ప్రజలు వాళ్ళ చెప్పు చేతలలో పడివుంటారు. అందుచేత స్కూళ్ళ నిర్వహణ భారాన్ని ప్రైవేట్ మేనేజ్‌మెంట్లకు అధీనం చేసేరు. వాటిని నడపడానికయ్యే ఖర్చులో కొంత ప్రభుత్వ సహాయంగా ఇస్తూ వచ్చేరు. ఈ సహాయాన్ని క్రమంగా పెంచుతూనూ వచ్చేరు. ప్రభుత్వం నడిపించే పాఠశాలలనీ ఎక్కువ చేసేరు. అయినా చాలవరకు వారి విద్యావిధానం ప్రైవేట్ యజమానులకు సహాయం ఇచ్చి స్కూళ్ళను నడిపింప చేయడంగానే వుండేది. రాష్ట్ర శాసనసభలు ఏర్పడి, రాష్ట్రప్రభుత్వాలు విద్యాబోధనను చేతిలోకి తీసుకొని కొన్ని శతాబ్దాలు గడిచినా ప్రభుత్వ సాయంతో ప్రైవేట్ యజమానులు స్కూళ్ళను నిర్వహించడం అనే పద్ధతి పోలేదు. ఆ పద్ధతిని రద్ధచేయడమే ఈబిల్లు వుద్దేశం.

ఈ ప్రధానమైన మార్పును తీసుకురావడమే మా ప్రభుత్వం వుద్దేశం. ప్రైవేట్ యజమానులే స్కూళ్ళను స్థాపించి నిర్వహించాలనీ, ప్రభుత్వం పనివారికి సాయం ఇవ్వడమేననీ ఒక అభిప్రాయం వుంది. ఈ బిల్లు దానిని పోగొట్ట దలచింది. పాఠశాలలను స్థాపించడం, నడిపించడం ప్రభుత్వ బాధ్యతయని మా ప్రభుత్వం యొక్క అభిప్రాయం. అది ఈ బిల్లులో వ్యక్తీకరించబడింది. పాఠశాలలను స్థాపించి నిర్వహించ

డంలో ప్రభుత్వం ప్రైవేట్ యజమానుల సాయం తీసుకొంటే తీసుకోవచ్చు. అది వేరుమాట. కాని పాఠశాలల బాధ్యత ప్రధానంగా ప్రభుత్వానిదేగాని ప్రైవేట్ యజమానులది కాదు. ప్రైవేట్ యజమానులకు ప్రభుత్వం తోడ్పడే పద్ధతిని మార్చి ప్రభుత్వానికి ప్రైవేట్ యజమానులు తోడ్పడే పద్ధతిని ప్రవేశ పెట్టడం చాలాముఖ్యం. విద్యాభివృద్ధికి ప్రభుత్వం పూనుకొని కృషి చేస్తుందని ఈ బిల్లుద్వారా ప్రభుత్వం ప్రకటిస్తూం దన్నమాట.

సాంస్కృతి కాభివృద్ధికోసం ప్రభుత్వం అనుసరిస్తున్న కొన్ని విధానాలను కూడా విద్యావిధానంలో తెస్తున్న ఈ మార్పులతోపాటు గమనించడం ముఖ్యం. సాహిత్య పరిషత్తుకూ, వివిధ కళాసంఘాలకూ ప్రభుత్వం ప్రోత్సాహం, సహాయం ఇస్తూంది. కేరళ ప్రజల సాంస్కృతికస్థాయి పెరిగితే తప్ప మనం నిర్మించదలచుకొన్న నవకేరళం రూపొందదు. అందుకే ఈ సంస్థ లన్నింటికీ ప్రోత్సాహమూ సహాయమూ ఇస్తున్నాం. బ్రిటిష్ పాలకులూ, వారి తాబేదారులూ మన ప్రజల్ని కూలీలూ, గుమాస్తాలుగా మాత్రమే వుంచాలని ప్రయత్నిం చేరు. అందుచేతనే ఆధునిక విజ్ఞానాన్ని ప్రజల కందించడానికి వాళ్ళు ప్రయత్నించలేదు. మేం అల్లాకాదు. తన మాతృభాష తెలిసిన ప్రతి మళయాళీకీ ఆధునిక విజ్ఞాన సంపదలు లభ్యమయ్యే టట్లు చేయడం మా వుద్దేశం. అందుచేతనే సాహిత్య, సాంస్కృ తిక సంస్థలన్నింటికీ సహాయం చేయదలచాము. ఇతర భాషల లోని ఉత్తమ గ్రంథాలను మలయాళంలోకి అనువదింప చేయా లనీ, మలయాళంలో ఉత్తమ గ్రంథాల రచనకు తోడ్పడాలనీ మా సంకల్పం.

కుళ రాజరికాన్ని వ్యతిరేకిస్తూ తమ రచనలు సాగించేరు.ఆధునిక ప్రజాతంత్ర ప్రపంచంలోని అభివృద్ధికరములయిన విషయా లన్నింటికీ ఆయన స్వాగతం పలికారు. ఫలితంగా ఆనాటి తిరువాంకూరు మహారాజు ఆయనను సంస్థానంనుంచి నిర్వాసి తుణ్ణి చేసేరు. ఇంకా అనేకమంది స్వాతంత్ర్యప్రియులు అనేక త్యాగాలు చేసి ప్రజలలో నూతన సామాజిక చైతన్యం కలిగించేరు. అన్యాయాన్ని సహించలేని మన స్తత్వాన్ని కలిగిం చేరు. మూడు దశాబ్దాలుగా మన రాష్ట్రంలోని కార్మిక వర్గమూ, రైతాంగమూ సాగిస్తున్న ఆర్థిక, రాజకీయ పోరా టాలను సంఘ సంస్కరణలకూ, సాంస్కృతికాభివృద్ధికి సాగించే పోరాటాలతో జతపరచి నడిపిన గౌరవం మనకు కలిగింది. నిజమైన ప్రజాతంత్ర వ్యవస్థ స్థాపనకై సాగించుతున్న ఈ వివిధపోరాటాలను ఏకముఖంచేసి నడుపుతే రాష్ట్రంలోని ప్రజాతంత్ర శక్తులన్నీ కలిసివస్తాయని విశ్వసిస్తున్నాము. అలా జరిగినప్పుడు మహారాజులూ, వారి దివానులూ పరిపాలన చేసిన రోజులలో పాతుకుపోయిన మధ్యయుగాల అనాగరి కతావశేషాలను పూర్తిగా తొలగించగలుగుతాం.

మీరీ రాష్ట్రంలో అమలు జరపదలచిన విధానం ఏమిటి? కమ్యూనిస్టుకార్యక్రమాన్నా,కమ్యూనిస్టేతర కార్యక్రమాన్నా మీరు అమలు జరుపుతారు? అంటూ ముఖ్యంగా విదేశ పత్రికావిలేఖరులు నన్ను ప్రశ్నిస్తున్నారు. భవిష్యత్తులో మేమేమి చెయ్యదలిచామో, ఇంతవరకేమి చేసేమో పైన వివరించేను. ఆ ప్రశ్నలు వేసేవారికది సంతృప్తి కలిగిస్తుందను కొంటాను.

కమ్యూనిస్టు కార్యక్రమానికీ, తదితర కార్యక్రమానికీ దేవుడికీ దయ్యానికీ వున్నంత పోలికవుందని కమ్యూనిస్టు వ్యతిరేకుల అభిప్రాయం. అందుచేత కమ్యూనిస్టు ప్రభుత్వం నూటికి నూరుపాళ్ళు కమ్యూనిస్టు సిద్ధాంతాల" కనుగుణ మయిన కార్యవిధానాన్నేగాని అమలు జరపదని వారి నమ్మకం. కమ్యూనిస్టులు అమలుజరిపే అంశాలను కమ్యూనిస్టేతరులు అంగీకరించడం కూడా సాధ్యం కాదని వారి వుద్దేశం. కమ్యూనిస్టు, కమ్యూనిస్టేతర కార్యక్రమాలు పూర్తిగా పరస్పర విరుద్ధములనీ, కమ్యూనిస్టు సిద్ధాంతాల కను గుణంగా వుండని వాటినన్నింటినీ నాశనం చేసే కమ్యూనిస్టు ప్రభుత్వమో, మెకార్థీ ధోరణిలో వ్యవహరించే కమ్యూనిస్టేతర ప్రభుత్వమో తప్ప మరొకమాదిరి ప్రభుత్వం వుండదని వారి విశ్వాసం. వక్రదృష్టితోతప్ప వారు వాస్తవ రూపాల్ని గమ నించలేరు. అందుచేత ప్రజాతంత్ర విధానాన్ని అమలు జరుపు తున్నామన్న కమ్యూనిస్టులకు వారు ద్రోహబుద్ధి అంటకడు తున్నారు. మా ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజాతంత్ర విధానా లను సమర్థించే కమూనిస్టేతరు లందరినీ వారు మూర్ఖులనీ, తెలివితక్కువవాళ్ళనీ నిందిస్తున్నారు.

ఈ పెద్దమనుష్యుల ఆలోచనలన్నీ తుప్పుపట్టి వున్నాయి. కమ్యూనిజం యెడ వారికున్న దురభిప్రాయాలతో వారి ఆలో చనలు స్పష్టతను కోల్పోయాయి. కమ్యూనిస్టులు కూడ ఈ భూమిలో పుట్టి పెరిగినవాళ్ళేననీ, ఈ ప్రజలమధ్య పుట్టి, పెరిగి బాధలు పడ్డవాళ్ళేననీ వారి వూహలకు తట్టదు. కేరళలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించినవారంతా తాము కమ్యూనిస్టులు కాకపూర్వం సంఘ సంస్కరణల కోసమూ, జాతీయ

స్వాతంత్ర్యం కోసమూ, రాజకీయ ప్రజాతంత్రం కోసమూ, సాంస్కృతికాభివృద్ధి కోసమూ పోరాడినవారేనని ఈ పుస్తక ప్రారంభంలో చెప్పేను. వారిలో చాలమంది జాతీయ కాంగ్రెసును రాష్ట్ర ప్రజానీకంలోకి తీసుకుపోయి ఒక ప్రజా సంస్థగా రూపొందించడంలో గట్టికృషి చేసేరు. వారు కార్మిక కర్షకోద్యమాలలోకి వచ్చేరన్నా, సోషలిస్టు భావాలను ఆకళించుకొన్నారన్నా ఏ మాస్కోనుంచో ఆజ్ఞలు రావడంచేత చేయలేదు. సాధారణ ప్రజల ప్రయోజనాల రక్షణకై జరిపిన పోరాటాల అనుభవం వారినటులాగింది. శాస్త్రీయమైన విస్పష్ట దృక్పథాన్నిచ్చిన మార్క్సిజం లెనినిజాన్ని వారు అనుసరించే రన్నా, ఆ సిద్ధాంతాన్ని అనుసరించే కమ్యూనిస్టుపార్టీలో చేరేరన్నా కారణం అదే. జాతీయ ప్రజాతంత్రోద్యమంలోని ఉన్నత దేశభక్తియుత భావాలూ, కార్మికోద్యమంలోని ఉత్సాహోద్వేగాలూ, మార్క్సిజమ్—లెనినిజమ్‌లోని శాస్త్రీయ దృక్పథమూ వారిలో మూర్తీభవించాయి. కమ్యూనిస్టులకూ జాతీయ ప్రజాతంత్రోద్యమాలకూ చుక్కెదురంటూ కమ్యూ నిస్టు వ్యతిరేకులు పనికట్టుకొని సాగిస్తున్న ప్రచారం ఎంత తప్పుడుదో చూపించడానికి ఇంతకన్న వేరే నిదర్శనం అవసరం లేదు.

కమ్యూనిస్టులకే కాదు ప్రజాతంత్రవాదు లందరికీ ఈనాడు ఏదో సిద్ధాంతాన్ని-భౌతికవాదాన్నో, భావవాదాన్నో సోషలిజాన్నో, పెట్టుబడిదారీ విధానాన్నో - వ్యతిరేకించడం ఒక్కటే పనికాదని ఆ పెద్దమనుష్యులకి అర్థంకాదు. ఏ సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నా అందరూ దేశంలో అత్యధిక సంఖ్యాకుల కంగీకారయోగ్యమయిన కార్యక్రమానికి ఒప్పుదల

కావాలి. ఆ కార్యక్రమం మనదేశ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించేది, బలపరిచేదిగా వుండాలి. ప్రజాతంత్రాన్ని కాపాడి విస్తరింపచేసే దిగా వుండాలి, సాంఘిక న్యాయం జరిగేటట్లు, దోపిడి నిర్మూలంఅయ్యేటట్లు, ఉన్న పరిశ్రమలనూ వ్యవసాయాన్నీ కాపాడుతూ, కొత్తవానిని ప్రారంభించేటట్లు దేశంలోని ఆర్థిక, సాంఘిక వ్యవస్థను సర్దుబాటు చేయగలగాలి. కమ్యూనిస్టు వ్యతిరేకులు ఎంత కళ్లు మూసుకొన్నా పైనచెప్పిన విధంగా సాధారణ కార్యక్రమంతో కలిసి పనిచేయడం అనేది మన జాతీయోద్యమంలో మామూలుగానే జరుగుతూంది.

లాహోరు కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించడమూ, కరాచీ కాంగ్రెసు ప్రధానహక్కుల తీర్మానాన్ని ఆమోదించడమూ, సామ్రాజ్య వ్యతిరేక సంయుక్త వుద్యమానికి పిలుపు నిస్తూనూ, వ్యవసాయిక కార్యక్రమాన్ని ఆమోదిస్తూనూ లక్నో, ఫెయిజ్‌పూర్ కాంగ్రెసులో తీర్మానించడమూ- జాతీయోద్యమంలోని ఈ సత్సాంప్రదాయానికి వుదాహరణలు. స్వాతంత్ర్యం వచ్చేకకూడా ఈ అలవాటు కొనసాగింది. వ్యవసాయ సంస్కరణలపై కుమారప్ప కమిటీ నివేదిక, రెండో పంచవర్ష ప్రణాళికకు ప్రాతిపదిక వేసిన ప్రణాళికా సూత్రాలూ యావత్తు జాతీయోద్యమమూ అనుసరించదగిన కార్యక్రమానికి ప్రాతిపదికలయ్యాయి. జాతీయ కాంగ్రెసుయెడ మా కమ్యూనిస్టులకెటువంటి అభిప్రాయాలున్నా ఈనాటి సమస్య కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీల మధ్యనున్న ఘర్షణా కాదు. కమ్యూనిస్టులకూ తదితరులకూ మధ్యనున్న ఘర్షణా కాదు. ఇంచుమించు అన్ని పార్టీలవారూ, అన్ని తరహాల ప్రజలూ ఆమోదించిన జాతీయ విధానాన్ని అతి సమర్థవంతంగా

నిర్వహించడం ఏలాగన్నదే ఈనాటి సమస్య. భారీ పరిశ్రమలకు ప్రాముఖ్యత నిస్తూ దేశాన్ని అతివేగంగా పారిశ్రామికం చేయాలి. మధ్యతరగతి, చిన్న కుటీర పరిశ్రమల్ని కాపాడాలి. పెంపొందించాలి. వ్యవసాయాన్ని ఆధునికం చేసి విస్తరింప చేయాలి, వృద్ధి పరచాలి. వ్యవసాయ సంస్కరణలను వేగంగా తీసుకురావాలి కష్టజీవులయిన ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల పరిస్థితులను బాగుపరచాలి. ప్రజలకున్న ప్రజాతంత్ర హక్కులను విస్తరింపచెయ్యాలి. ఇవన్నీ ఆ కార్యక్రమంలో భాగాలు.

ఈ పుస్తకంలో మేము ఏం చేసేమో, ఏం చెయ్యబోతున్నామో చెప్పేము. అవి చదివితే కమ్యూనిస్టు ప్రభుత్వం కమ్యూనిస్టేతర కార్యక్రమాన్ని అమలుజరపడంలో వైరుధ్యం ఏమీలేదని అర్థం అవుతుంది. మేము ఆచరించదలచుకున్న కార్యక్రమం కమ్యూనిస్టులదీ కాదు. కమ్యూనిస్టేతరులదీ కాదు. అది కమ్యూనిస్టులదీ, కమ్యూనిస్టేతరులదీ కూడా. దేశాన్ని నిజంగా ప్రేమిస్తున్నవారందరిదీ ఆ కార్యక్రమం. ఈ కార్యక్రమాన్ని రూపొందించినది మేమే అనము. కాని దానిని రూపొందించడంలో మా కమ్యూనిస్టుల పాత్ర చాలా వుంది. ఆ కార్యక్రమాన్ని రూపొందించడంలో కమ్యూనిస్టేతరులకు కూడా విశేషపాత్ర వుంది. అందుకే అది మన జాతీయోద్యమం యొక్క వారసత్వం అనడం.

కాని ఒక్కటి. దేశంలోని ఏపార్టీకన్నా, ఏ తరగతి కన్నా కమ్యూనిస్టులం ఆ కార్యక్రమం అమలు జరగాలని హృదయపూర్వకంగా కోరుతున్నాం. అది అమలు జరపాలని పట్టుదలగా వున్నాం. ప్రతిపక్షంలో వున్నప్పుడు ఇతర పార్టీల వారితో కలిసి దానికోసం పోరాడాం. విఫలం అయ్యేం. అతి

క్లిష్టపరిస్థితుల్లో గడచిన ఎన్నికలల్లో మెజారిటీ సంపాదించి అధికారంలోకి వచ్చాం. ఎన్నిక రోజుల్లో మా ప్రతికక్షులు మామీద ఎంతో దుష్ప్రచారం చేసేరు. హంగరీని చూడండి అనీ, కృశ్చేవ్ కమ్యూనిజం నిజరూపాన్ని బయట పెట్టాడు చూడండి అనీ, అనేక వాదనలు తెచ్చేరు. 1942 లో కమ్యూనిస్టులు ద్రోహం చేసేరన్న పాతప్రచారం ఒకటుండనే వుంది. కమ్యూనిస్టుల పని అయిపోయిందని వారు అనుకున్నారు. కాని చివరకు వారి అంచనాలన్నీ తప్పేయి. మేము ప్రజలకోసం రాత్రీ, పగలూ అనకుండా చేసిన సేవా, పడ్డ బాధలూ, చేసిన త్యాగాలూ ప్రజలు ఎరుగుదురు. మా విధానాలను విమర్శించేవారూ, మేము తప్పులు చేసేమని విశ్వసిస్తున్నవారూ కూడ మేము జాతీయాభివృద్ధికి పాటుపడతామని, ప్రజావుద్యమాలకు నిజాయితీగల ప్రతినిధులమనీ వొప్పుకుంటున్నారు.

వీటన్నింటి ఫలితంగా మామీద చాల బరువుపడింది. ఈవేళ జాతీయరక్షణ దేశం అందరి కర్తవ్యం. ఆ కర్తవ్యనిర్వహణలో మిగిలిన రాష్ట్రాలకన్న ప్రశస్తంగా మేము పని చేస్తే కమ్యూనిస్టు వ్యతిరేకుల ఆశలూ, వూహాలూ వ్యర్థమవుతాయి. వ్యవసాయ సంస్కరణలను తేవాలి. రాష్ట్ర పరిపాలనా వ్యవస్థను చక్కబెట్టి, బాగుపరచాలి. దేశపునర్నిర్మాణ కార్యక్రమాలను చురుకుగా సాగేటట్లు చేయాలి. ఇవన్నీ సరిగ్గా చేయగలిగేమా దేశానికంతకూ ఒకపంథా చూపినవాళ్ళం అవుతాం. దేశంలోని ప్రధానసమస్యల యెడ నూతనదృక్పథం తీసుకొని, పనిచేసేటట్లు వివిధపార్టీలకు చెందిన వారిలో అత్యధిక సంఖ్యాకులను ఉత్సాహపరచ గలుగుతాం. ఈ కర్తవ్య

నిర్వహణలో విఫలులంఅయ్యే మాకమ్యూనిస్టు వ్యతిరేకులు దేశాన్ని మరింతగా చీలుస్తారు. కమ్యూనిస్టులకూ-ఇతరులకూ మధ్య భేదాలు తెస్తారు. ఇతర దేశాలు చాలవానిలో తెచ్చిపెట్టి నట్లు అంతఃకలహాలు తెచ్చి పెడతారు. అందుచేత మేము జయించడం, ఓడడం అనే వాని ఫలితాలు ఒక్క మారాష్ట్రం లోనే కాదు. దేశవ్యాప్తంగా వుంటాయి.

మా కర్తవ్యాల నిర్వహణలో మాకు దేశం యావత్తూ సద్భావం చూపుతున్నదని మేమెరుగుదుం. మాపార్టి సభ్యులూ మిత్రులూ మాత్రమే కాదు. వామపక్షాలకు చెందినవారే కాదు. కాంగ్రెసువారూ, మితవాద పార్టీలకు చెందినవారూ, ఏపార్టీకి సంబంధించనివారూ అత్యధిక సంఖ్యాకులు మేము చేయవలసిన పనియొక్క గురుత్వాన్ని గుర్తించేరు. "కేరళలో ఒక నూతన పరిశోధన" జరుగుతూందని వారు అంటున్నారు. మా విజయాన్ని కోరుతున్నారు. చేయగలంతలో నైతిక, భౌతిక సహాయం ఇస్తున్నారు. దేశంలోని నిష్పక్షపాతులయిన ప్రజలందరూ చూపుతున్న ఈ సానుభూతీ, స్నేహభావమూ మాకెంతో బలం కలిగిస్తూంది. కమ్యూనిస్టు వ్యతిరేకుల్ని నిరుత్సాహపరుస్తూంది. మేమేవన్నా తప్పులు చేసినప్పుడు వారు తప్పక స్నేహపూర్వకమయిన విమర్శనలు ఇస్తారనిఆశిస్తున్నాం. వారి స్నేహసానుభూతుల సహాయంతో మార్గంలోవున్న ప్రతిబంధకాలను గడచి మా భుజస్కంధాలమీద నున్న కర్తవ్య భారాన్ని సక్రమంగా నిర్వహించగలమని ఆశిస్తున్నాం.

BC

**Nutana Kerala Rashtra Samasyalu** Price **56** np.

# కేరళలో ప్రజా పరిపాలన

(రెండవ ముద్రణ)

నండూరి ప్రసాదరావు



భారత దేశంలో మొదటిసారిగా ఏర్పడ్డ కమ్యూనిస్టు ప్రభుత్వం కేరళ ప్రజానీకానికి యే రకంగా సేవ జేసిందీ, చేస్తుందీ అఖిలభారత రైతుసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ నండూరి ప్రసాదరావుగారు వివరంగా వ్రాశారు. ధర : 44 న. పై.

ప్రతివారు చదివితీరవలసిన పుస్తకం!

---

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada-2.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B147 |
| పుస్తకం పేరు | నూతన కేరళ రాష్ట్ర సమస్యలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | BCI,CI |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |